# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము.

సంపుటము 34 | ఆగష్టు 1991 | సంచిక 8

## విషయసూచిక






సంవత్సర చందా : తెలుగు లేక ఇంగ్లీష్ (ఒక సంవత్సరమునకే స్వీకరింపబడును)

ఇండియా : రూ. 20/— ఓవర్సీస్ : (ఎయిర్ మెయిల్) - U. S. $ 9, £ 5.00 లేక రూ. 140/—
(సీ మెయిల్) - U. S. $ 4.5, £ 2.5 లేక రూ. 70/—

చందాకొరకు పంపే పైకము ఎకౌంటుపేయీ డిమేండుడ్రాఫ్ట్ / టెలిగ్రాఫిక్ బ్యాంక్ ట్రేన్సఫర్ / ఇండియన్ లేక అంతర్జాతీయ మనియార్డరు / ఇండియన్ లేక అంతర్జాతీయ పోస్టల్ ఆర్డరు ద్వారా— "కన్వీనరు, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు, ప్రశాంతినిలయం (పోస్టు), పిన్- 515 134 అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, ఇండియా" కు పంపవలెను.

మనియార్డరు కూపనుపైన చందాదారుని పూర్తిచిరునామా మరియు పత్రిక (తెలుగు / ఇంగ్లీషు) ఏ భాషలో కావలెనో, స్పష్టముగా పెద్ద అక్షరములతో వ్రాసి పంపవలెను. చందా రెన్యూవల్ కోరునప్పుడు, ప్రస్తుత చందా సంఖ్యను పేర్కొంటూ, రెండు నెలలకు ముందుగా పైకము పంపవలె.


**ముఖ్య గమనిక:** ప్రశాంతినిలయములో ఈ సంవత్సరము దసరా ఉత్సవాలు జరుపబడవు.


శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు, ప్రశాంతినిలయం తరపున ప్రమోద్‌కుమార్ సూరిచే, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్సు ప్రశాంతినిలయంలో ముద్రింపబడి, ప్రచురింపబడినది.

సంపాదకులు : వి. కె. నరసింహన్.

గ్రామ్సు: బుక్‌ట్రస్టు, టెలిఫోన్: 375 అండ్ 236. S. T. D. 08555, I. S. D. 0091-08555

గురుపూర్ణిమ సందేశం:

# నిన్ను నీవు తెలుసుకో

> భ్రమేనాహం భ్రమేనత్వం భ్రమేనోపాసకం మనః।
> భ్రమేనేశ్వర భావత్వం భ్రమమూల మిదం జగత్.॥

"భ్రమ చేతనే 'నేను' — 'నీవు' అనే భావాలు ఏర్పడుతున్నాయి. మనస్సునకు, ఉపాసనకు, ఈశ్వరభావత్వానికి, ఈ సమస్త జగత్తునకు భ్రమయే మూలకారణం".

ప్రేమస్వరూపులారా!

కంటికి కనిపించునది, చెవులకు వినిపించునది, మనస్సునకనిపించునది, హృదయాన్ని మైమరపించునది ఈ భ్రమయే. భ్రమయే జగత్తు. జగత్తే దృశ్యం. బ్రహ్మయే ద్రష్ట. ఈ జగత్తు దృశ్య ద్రష్టల సమ్మిళితమైన స్వరూపం.

"భారత దేశంలో గురుశిష్య సంబంధం రానురాను పూర్తిగా తగ్గిపోయినది. సత్య సంపద, క్రమశిక్షణ క్రమక్రమముగా సన్నగిల్లిపోయినవి. భక్తి విశ్వాసములు రెండును తొలగిపోయినవి. ప్రపంచమంతటా బాధ్యతలు లేనట్టి స్వాతంత్ర్యపరత నిండిపోయినది. ధన ప్రాధాన్యత హెచ్చిపోయినది. ధర్మానికి ప్రాధాన్యత తగ్గిపోయినది. ఇంతకంటెను వేరేమి చెప్పగలను?"

## 'స్వవిమర్శో మోక్షః'

ఈ విశాల సృష్టియందు మానవుడు తెలుసుకొనవలసిన విషయములు అనంతములైయుండగా, సమస్త మానవులనుండి వెలువడే 'నేను-నేను' అనే పదాన్ని గుర్తించమని భారతీయ వేదాంతం ప్రబోధిస్తోంది. ఈ అనంతమైన ఆత్మతత్త్వాన్ని గుర్తించుకొంటే, సమస్తమును గుర్తించినవాడౌతాడు. "యద్ విజ్ఞానేన సర్వం విజ్ఞాతుం భవతి" అని శ్రుతి ప్రమాణం. 'నేను' అనే పదానికర్థము చక్కగా గుర్తించినప్పుడే, మానవుడు సమస్తమును గుర్తించినవాడౌతాడు. ఎక్కడ చూచినా 'నేను, నేను' అనే పదము సర్వవ్యాపకమై, సర్వాంతర్గతమైయున్నదని భగవద్గీత ప్రబోధిస్తోంది. ఏ వేద శాస్త్ర, ఇతిహాస పురాణములు పరికించినప్పటికీ

"నిన్ను నీవు తెలుసుకో" అని ప్రకటిస్తున్నాయి. దీనినే "స్వ విమర్శే మోక్షః" అన్నారు. ఈ లోకంలో ప్రతిమానవుడు తనను తాను పరిచయం చేసికొను సమయమున 'నేను రాముడను', 'నేను సీతను' అని ఎవరంతటికి వారు 'నేను నేను' అనే పదాన్ని ఉపయోగపెట్టుకుంటూ, తమను గురించి తాము చెప్పుకుంటూ ఉంటారు. కాబట్టి అనేక భేదములుండినప్పటికిని, 'నేను' అనే పదము 'పూసలలోని దారము' వలె సమస్త మానవుల యందు వ్యాపించియే యున్నది. అందుచేత, ప్రతిమానవుడు ఈ "నేను" అనే తత్త్వాన్ని చక్కగా గుర్తించుకొనుట చాల అవసరమని గ్రహింపవలెను.

## 'నేను' అనగా ఏమిటి ?

మానవుడు అనిత్యమైన ఈ దేహాన్ని 'నేను' అని భ్రమించుటచేత, అనేక బాధలకు గురియగుచున్నాడు. "అహం ఏతత్ న" అని శ్రుతి స్వరూప జ్ఞానాన్ని బోధిస్తున్నది. అహం=నేను, ఏతత్=ఇది, న=కాదు. అనగా 'నేను ఇది కాదు.' అని అర్థం. ఈ జ్ఞానమే సత్, చిత్ ఆనందస్వరూపములను స్మృతికి తెస్తూ, సమ్యక్ జ్ఞానమును ప్రబోధిస్తోంది. 'నేను' అనగా ఏమిటి? శృతి ప్రమాణమును పురస్కరించుకొని, "నేను" అనే పదమునకు ఆత్మ, పరమాత్మ, బ్రహ్మ, ప్రత్యగాత్మ—అని అనేక నామములు కలవని తెలియుచున్నది. ప్రతిమానవునియందు-భుజించిన ఆహారమును జీర్ణింపజేసి, ఆహారరసస్వరూపాన్ని సర్వాంగములకు వ్యాపింపజేయుటచేతనే ఈ 'నేను' వైశ్వానర స్వరూపాన్ని ధరిస్తోంది. ఈ హేతువుచేత 'నేను' అనేది ప్రతి మానవునియందు వైశ్వానరరూపంలో ఉంటుంది. పరమాత్మ అనగా కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, మనో బుద్ధి, చిత్త, అహంకారములకు అతీతమైన తత్త్వమని చెప్పవలె. ఇటువంటి పరమాత్మ తత్త్వం బ్రహ్మ తత్త్వంగా రూపొందింపబడుతూ వచ్చింది.

## 'నేను' దేహము కాదు

బ్రహ్మ అనగా ఏమిటి? వ్యాపకత్వమే బ్రహ్మతత్త్వం. ప్రతి మానవునియందు "నేను" అనేది వ్యాపించి యున్నది. కనుక సర్వ మానవులయందు వ్యాపించిన 'నేను' అనునది "బ్రహ్మ" అని చెప్పబడుతోంది. 'నేను' అనేది బ్రహ్మస్వరూపమే. ఇక 'ఇది' అనే పదము సర్వ దృశ్యములయందు వ్యాప్తమైయున్నది. ఉదాహరణకు:— ఇది మైకు, ఇది సూర్యుడు, ఇది చంద్రుడు అంటాము. ఇట్లు 'ఇది' అనే పదము దృశ్యములయందు అంతర్లీనమై యుంటున్నది. మొత్తముపైన దీని అంతరార్థము ఏమనగా, 'ఇది' అనే పదము దృశ్యములకు సంబంధించినది అని గ్రహింపవలె. 'ఇది' అనే పదము లేకపోతే, ఒక బట్టనుగూర్చి చెప్పినప్పుడు, ఏది బట్ట? అని ప్రశ్నవస్తుంది. అప్పుడు "ఇది బట్ట" అని దానిని నిరూపించడం జరుగుతుంది. కనుక సమస్త దృశ్యములందు వ్యాపకమై యుండిన తత్త్వమునకే "ఇది" అని పేరు. 'ఇది' దృశ్యము; 'నేను' ద్రష్ట. కాబట్టి 'నేను' దృశ్యము కాదు, 'నేను' ధరించినది "ఇది"- అదే దేహం. సర్వమూ చూచినట్లుగా నా దేహాన్ని చూస్తున్నాను. దేహము దృశ్యమే.

ఈ దృశ్యమైన దేహమును 'నేను'అనే ద్రష్టగా భావించడం అజ్ఞానం. మన దేహము దృశ్యములలో ఒకటి. దేహమునే 'నేను' అని భావించడం కేవలము అనర్థము. ఈ శరీరము సమాధిస్థితియందు, గాఢనిద్రయందు మనకు కనిపించుట లేదు. కాబట్టి నీవు దేహం కాదు. నీవు ద్రష్టవే. అయితే నానారూపములతో సృష్టింపబడిన ఈ జగత్తులో అంతటికిని అధిష్ఠాన తత్త్వము అనేది ఒకటి ఉంటున్నది. ఈ అధిష్ఠాన వస్తువునుండి సర్వమూ నిర్మింపబడగలుగుచున్నది. అధిష్ఠానమే లేకపోతే— ఏ వస్తువునూ, ఎవ్వరూ నిర్మాణం చేయలేరు.

ఒక చిన్న ఉదాహరణః— అనేక రకములైన బంగారు ఆభరణాలుంటాయి. ప్రతీ ఆభరణములో ఉండేది బంగారం ఒక్కటే. ఆ ఆభరణములన్నింటినీ కరిగించి ఒక చోట పోసినప్పుడు ఆ బంగారమంతా ఒక ముద్దగా తయారౌతుంది. అందుచేత ఆభరణ రూపములో ఉన్న బంగారం వేరువేరుగా కనిపించినప్పటికినీ, కరిగించి పోసినప్పుడు తాను తానుగానే నిలిచిపోతున్నది. అందుచేత బంగారమునకు ఎట్టి మార్పుగాని, ఎట్టి వికారంగాని కలుగనేరదు. అదేవిధముగనే దృశ్యమంతా అనేక రూపనామములతో ఉండినప్పటికిని, దీనికి ద్రష్టగా 'నేను' అనేది మార్పుచెందక అధిష్ఠానత్వమును పొందివుంటుంది. కాబట్టి 'నేను' అనే అధిష్ఠానము నుండియే సర్వము ఆవిర్భవిస్తున్నది. 'నేను' అనినంతనే దేహము అనే అర్థాన్ని మనము తీసికొనరాదు.

## నీవు ద్రష్టవనే సత్యాన్ని గుర్తించు

మానవుడు ఇట్టి సత్యమును గుర్తించినప్పుడు ఈ దృశ్యకల్పితమైన జగత్తునందు ఎట్టి విచారమును పొందడు. అట్టివాడు ఎప్పటికీ ఆనందములో మునిగి ఉంటాడు. అధిష్ఠానము లేక ఆకారములు కనిపించవు. "నేను, నేను" అనే తత్త్వం సమస్త ఆకారములందు నిత్యంగా ఉంటోంది. ప్రతిమానవునియందు, సమస్త జీవులయందు ఆవిర్భవించే మొదటి శబ్దము 'నేను'. ప్రణవముతోబాటు ముందుగా ఉన్నది "నేను". ఈనాడు అధిష్ఠానమైన దివ్యత్వాన్ని విస్మరించి, వికారఆకారములతో కూడిన పైపైనవేషాలనే విశ్వసించి అనేక బాధలకు గురికావలసి వస్తోంది. కాబట్టి ప్రతిమానవునియందు దివ్యత్వమనేది సర్వవ్యాపకమై ఉంటున్నది. ఎవడు బ్రహ్మజ్ఞానమును గుర్తింపగలడో, వాడే బ్రహ్మగా రూపొందగలడు. "బ్రహ్మవిదాప్నోతి పరం" అనగా ఈ "నేను" అనే తత్త్వాన్ని గుర్తించినవాడు "పరబ్రహ్మగా" మారిపోతాడు. శోకనివారణ చేసికొనుటకు, తానెవరో గుర్తించుకొన్నప్పుడే శోకనివారితుడు కాగలడు. ఉన్నది ఒక్కటే. రెండవది ఏదీ లేదు. ఇది శ్రుతుల ప్రమాణము. కానీ మానవుడు పెద్దల బోధలనుకానీ, శ్రుతులనుకానీ లెక్కపెట్టక పెడచెవిని పెట్టుట చేతనే తన స్వరూపాన్ని తాను మరచిపోతున్నాడు. తాను దేనిని తెలుసుకుంటే సమస్తమును తెలుసుకోగలడో, అట్టి దానిని తెలుసుకొనుటకు ప్రయత్నించాలి. ఒక్క మట్టిని మనము గుర్తించుకుంటే ఆ మట్టితో చేయబడిన పాత్రలన్నింటిలో మట్టి

కూడి ఉంటుందనే సత్యం మనకు గోచరమౌతుంది. కుండలో మట్టి ఉన్నది. కాని మట్టిలో కుండలు లేవు. కుండలు కల్పితం. కనుకనే దృశ్యములందు ద్రష్ట ఉన్నాడు, కాని ద్రష్టలో దృశ్యం లేదు. అందుచేత "నీవు ద్రష్టవు, నీవు ద్రష్టవు" అనే సత్యాన్ని చక్కగా గుర్తించుటకు ప్రయత్నించాలి.

ద్రష్టకు అనేక పేర్లు ఉన్నవి. జాగ్రదావస్థయందు 'నేను' అనేటటువంటిదే సర్వ వ్యాపకత్వమై ఉంటుంది. అనేక రూపనామంలతో కూడియుండుటచేత 'విరాటస్వరూపుడు' అని, సర్వవిషయములతో వ్యవహరించుటచేత "వ్యావహారికుడ"ని, ప్రతీపదార్థమునందు అభిమానము కలిగి వుండుటచేత 'విశ్వుడు' అని - చెప్పబడుతోంది 'నేను' పరముగా ఆత్మకు ఇన్నిపేర్లు కలుగుతూ వస్తున్నాయి.

స్వప్నావస్థయందు 'నేను' అనే పదానికి అనేక పేర్లు ఉంటున్నవి. "స్వప్న కలితుడు" అని, మనస్సునే ఆధారముగా ధరించినవాడు కాబట్టి 'ప్రత్యగాత్మ' అని, ప్రజ్ఞచేత తాను ప్రతీ తత్త్వమును గుర్తించుకొనడానికి ప్రయత్నిస్తున్నాడు కాబట్టి "చిత్తైకాగ్రుడ"ని, - ఈ రీతిగా 'నేను' అనే పదానికి పర్యాయపదములు చెప్పబడుచున్నవి. సుషుప్తియందు అంతఃకరణ ప్రభావముచేత సమస్తమును తెలుసుకోగలుగుచున్నాడు కాబట్టి ఈ 'నేను' అనే పదానికి "ప్రాజ్ఞుడ"ని మరొక పేరు పెట్టబడినది.

నా దేహము అనుకొన్నప్పుడు దేహము వేరు కావాలి, 'నేను' వేరు కావాలి. అట్లే నా బట్ట అంటే బట్టవేరు, 'నేను' వేరు అవుతుంది. అందుచేత నాదేహము అనుకొన్నప్పుడు దేహము నీవు కాదు. దేహము ఒక దృశ్యం, ఇంద్రియములు ఒక దృశ్యం, మనస్సు ఒక దృశ్యం, చిత్తము ఒక దృశ్యం, అంతఃకరణ మరొక దృశ్యం. కాబట్టి సర్వమూ దృశ్యములే అవుతాయి. తెలియబడుచున్న విశ్వము దృశ్యమగును. సమస్తమును చూచు వ్యక్తియే—ద్రష్ట. ఆ ద్రష్టయే "నేను" అగును. ఇంత కన్నా మించిన అన్యమేదియూ లేదు. ఇదే సత్యం. ఇదే సమస్త వేదముల సారాంశం.

## నిజమైన వేదాంతం

వేదాంతమనగా ఏమిటి? వేదాంతమనగా ఏదో అర్థముకాని పదముల నుచ్చరించుట గాదు. తనను తాను గుర్తించుకొనుటయే నిజమైన వేదాంతం. తనను తాను గుర్తించుకోలేక పోవుటయే మరుపు. మరుపే దృశ్యం. ఎఱుకే బ్రహ్మ. ఎఱుక అనగా జ్ఞానము అని అర్థము. జాగ్రదావస్థలోని జాగ్రత్తయే ఎఱుక. అనగా జాగ్రదావస్థలోని జ్ఞానమునకే ఎఱుక అని పేరు. కనుక నిరంతరం మనము జాగ్రత్తయందే ఉండాలి. ఆత్మయే కారకం. కారక మనేది-'నేను', 'నేను' అనే పదమునకంతరార్థప్రబోధం. భగవద్గీతయందు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అని తెలుపబడినది. అన్ని ధర్మాలు 'నీవు' అనే తత్త్వాన్ని విసర్జించమన్నాయి. అన్ని ధర్మాలంటే ఏమిటి? అసలు ధర్మమంటే తెలిస్తే గదా! అన్ని ధర్మాలు వదిలిపెట్టేది. ఇక్కడ ధర్మమనగా- ఒక్కొక్క వస్తువునకు ఒక్కొక్క ప్రాణ సమానమైన ధర్మగుణం ఉంటున్నది. అదే ఆ వస్తువు యొక్క సహజధర్మం. అగ్నికి

వేడి ధర్మం. వేడి లేకపోతే అది బొగ్గుగా మారిపోతుంది. అది అగ్ని అనిపించుకోదు. చక్కెరకు తీపి ధర్మం. తీపి లేకపోతే అది కేవలం ఇసుక అవుతుంది కాని చక్కెర మాత్రం కాదు. అదే విధంగా మానవుని ధర్మం ఏమిటనగా వాంఛలు కలిగియుండుటయే. నిరంతరం వాంఛలు పెంచుకోవటమే మానవుని ధర్మం. కనుక వాంఛలు త్యజించటమే "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అని చెప్పబడుతుంది. ఈ విధానమే వైరాగ్యమని పిలువబడుతుంది.

## ఆత్మజ్ఞానం ప్రకటించు

ఈనాడు అనేక రకములైన వాంఛలు మితిమీరిపోవుట చేతనే మానవుల మతులు భ్రమిస్తున్నాయి. వాంఛలను కొంత అదుపులో పెట్టుకోవాలి. పశువులు తమ కడుపు నిండగానే తమ వాంఛలను తగ్గించుకొంటాయి. కాని ఈనాటి మానవుడు తాను తిని, తాను తిన్న దానికి ఆనందించుటకు బదులుగా ఇంకా అధికమైన దానిని ఆశిస్తున్నాడు. ఒక మాటలో చెప్పాలంటే, మానవుని కంటే పశు పక్ష్య మృగాదులే మేలనిపిస్తున్నాయి. ఎందుచేతననగా వాటికి దాచుకునే గుణం, దోచుకొనే దుర్మార్గం ఏమాత్రము లేవు.

కాని, ఈనాటి మానవుడు తన మానవత్వాన్ని తాను పూర్తిగా కోల్పోయి బాధలు పడుటకు కారణము "తానెవరు" అనే సత్యాన్ని గుర్తించుకొనలేకపోవుటయే. ప్రతిమానవునియందు "నేను ఆత్మ" అనే విజ్ఞానం వికసించాలి. ఆ విజ్ఞానం వికసించినపుడే ప్రజ్ఞానం ప్రకటితమౌతుంది. అప్పుడే ఒక ప్రత్యక్షమైన సందర్శనం కలుగుతుంది. కనుక మనలో ఉన్న దివ్యత్వాన్ని వికసింపచేయాలి, ప్రకటింపచేయాలి.

## భారతీయులు ఆత్మస్వరూపులు

భారతదేశమునకు మించిన దేశం మరొకటి లేదు అన్ని అవతారాలు భారతదేశంలోనే అవతరిస్తున్నాయి. ఈనాడు మనము మహత్తరమైన భారతదేశమును సరియైన పద్ధతిలో పెట్టుకోలేక పోతున్నాము. ఇటువంటి భారతదేశంలో మనము పుట్టినందులకు గర్వించాలి. ఆదర్శవంతమైన జీవితాన్ని మనము అనుభవించాలి. అట్లుకాక, భారత దేశము నుండి విదేశీయులు భారతీయుల భాగ్యాన్ని దోచుకొనిపోతున్నారు. భారతీయులు విదేశాలకు వెళ్ళి, అక్కడి మాలిన్యాన్ని తెచ్చుకుంటున్నారు. ఇదేనా— నిజమైన భారతీయుని లక్షణం! కాదు, కాదు. భారతీయులు ఆత్మస్వరూపులు. ఇట్టి సత్యాన్ని గుర్తించినవాడు విదేశీయుడైనా ఆత్మ స్వరూపుడే. నేడు గుర్తించుకొనే శక్తి సామర్థ్యాలు వారి వద్ద లేకపోతున్నాయి.

భారతీయులు ఆత్మస్వరూపులని గుర్తించుకోవడానికి తగిన శక్తిసామర్థ్యములు కలవారని తెలియజేసే ఎన్నో ఉదాహరణలు వేద శాస్త్ర ఇతిహాస పురాణములందు ఎక్కడ చూచినా కనిపిస్తూనే ఉంటాయి. మానవుడు దివ్యత్వంలోనే లీనం కావాలి. ఇట్టి సత్యాన్ని గుర్తించడానికి ప్రయత్నించండి దానికి తగిన పరిశోధనలు చేయండి. "నిన్ను నీవు తెలుసుకో" అని వేదాలు ప్రబోధిస్తున్నాయి. నీవు వేదాలను తెలుసుకొనుటకు ప్రయత్నించాలి. తెలుసు

కొన్నవి ఆచరణలో పెట్టాలి. అప్పుడే నీ తత్త్వం నీవు గుర్తించుకొనుటకు వీలవుతుంది.

## నీవే భగవంతుడవు

"నేను దేహము కాదు. నేను అన్నిటికీ సాక్షీభూతుడనై ఉంటున్నాను" అనే సత్యాన్ని మీరు గుర్తించాలి. ఇంద్రియములు అనిత్యములైనవి. అట్లే వానినుండి వచ్చిన ఫలితాలు కూడా అనిత్యములే. నిజమైన సత్యం హృదయము నుండి ఆవిర్భవిస్తుంది. నీవే భగవంతుడవు. అటువంటి దివ్యమైన విశ్వాసాన్ని మనము అభివృద్ధి పరచుకోవాలి. మానవుడు అనగా విశ్వాసముకల జీవి అని అర్థం. మనం విశ్వసించిన విషయాన్ని ఆచరణలో పెట్టినప్పుడే విశ్వాసం మరింత అభివృద్ధి అవుతుంది. నమ్మినది ఆచరించాలి. కాని ఈనాటి మానవుడు ఈ సత్యాన్ని గుర్తించుట లేదు, విచారించుట లేదు. బాహ్యమైన, లౌకికమైన, జగత్సంబంధమైన విషయములందే తన కాలాన్ని వ్యర్థం చేసికొంటున్నాడు. సముద్రం నుండి పుట్టిన ఆ అలలు అనేక రూపములు ధరించి, ఆ సముద్రమునందే ఆడి, పాడి, తిరిగి ఆ సముద్రమునందే లయమైపోతున్నాయి. ఆవిధముగనే మానవుడు దివ్యత్వమునుండి పుట్టినందులకు, ఆ దివ్యత్వమునందే జీవించి, దానియందే అంత్యం కావాలి. అదే నిజమైన మానవత్వము యొక్క లక్ష్యం.

మన జీవితమంతా ఎంతో పవిత్రమైనది, దివ్యమైనది, ధన్యమైనది. ఇట్టి పవిత్రమైన జీవితమును పాడు కోరికలకై వ్యర్థము చేయరాదు. ఈ దేహతత్త్వాన్ని ఒక దృశ్యంగా భావించుకోవాలి. దానిని ఒక పనిముట్టుగా స్వీకరించి, దానితో సమస్త కార్యములు పవిత్రమైనవిగా చేసికోవాలి. అప్పుడే ఈ మానవత్వం ఒక దివ్యత్వంగా మారిపోతుంది. దీనికి ఒక్కటే మార్గం. అదే దైవ చింతన. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి". ఇంతకు మించిన మార్గం వేరొకటి లేదు. దైవచింతన చేస్తూ, చేస్తూ నీవు కూడా ఆ దైవమై, ఆ దైవత్వాన్ని పొందగలవు, చేరుకోగలవు.

—శ్రీవారి దివ్యబోధ
పూర్ణచంద్ర ఆడిటోరియం
ప్రశాంతినిలయం,
26—7—1991



# పర్తిలో గురుపౌర్ణమి

గీ॥ పుట్టపర్తి క్షేత్రమ్మున మోదమెసగ
సకల నిగమాంత వేద్యుండు సత్యసాయి
దేవదేవుండు సద్గురుదేవుఁడయ్యె
వ్యాసపౌర్ణమి ఈ రీతి వాసిగాంచె.

గీ॥ నిండు పేరోలగంబున నిపుణభక్తి
బాలబాలికా బృందంబు భక్తతతియు
"సాయిసద్గురు" పూజింప సాగినారు
వ్యాసపౌర్ణమి— ఈ రీతిపరిమళించె.

ఉ॥ సందడిగాగ భక్తజన సంతతి వందలు వేలు వచ్చుటా
నందము కల్గజేసె; నయనంబుల హర్షము వర్షమయ్యె; పూ
ర్ణేందునిబోలు ఆ మహలు చేరిరి సాయిని చూడగోరి; బల్
సుందరమైన పద్ధతిని మాటిగఁదెల్పెను "ఆత్మవిద్య"; ఏ
మందము? "సత్యసాయి" మనమందమటంచు తలంచిరందరున్

ప్రతి సంవత్సరం గురుపౌర్ణమి పర్తిలో జరుగుట లోకవిదితమే. దేశ విదేశములందు గల భక్తబృందము సత్యసాయి భగవానుని దర్శింప వచ్చుట పరిపాటి. ఈ సంవత్సరం గురుపౌర్ణమికి వేలకుమించినసంఖ్యలో భక్తులు వచ్చుటచేత, మరింత విశేషశోభను సంతరించుకొన్నది.

శ్రీ సత్యసాయి భగవానుఁడే సద్గురుదేవుడగుటచేత ఆతనిని పూజించుట, ఆతని బోధలు వినుట బహుజన్మ సుకృతంగా భావింపవలసిన విషయము. ఈ వేడుక సందర్భంగా ప్రశాంతి నిలయ ప్రాంగణమంతయు వివిధాలంకరణములతో కన్నులవైకుంఠంగా అలంకరింపబడినది. ఆనాటి ప్రాతఃకాల సమయమందు ప్రకృతి యంతయు ప్రశాంత వాతావరణము కలిగియుండెను. ప్రశాంతినిలయం, బృందావనం, అనంతపురం క్యాంపస్‌లకు చెందిన విద్యార్థినీ విద్యార్థులు ప్రశాంతినిలయ మందిరమును చేరుకొని, బారులుతీర్చి కూర్చుని— భగవానుని రాకకై వేచియుండిరి. అట్టి సమయమందు మందిర ప్రాంగణములో సద్గురువగు "సాయినాథు" ని స్తుతించుచూ విద్యార్థులచే శ్రావ్యముగా గానము చేయబడినది.

ఆనాటి సాయంత్రం "పూర్ణచంద్ర ఆడిటోరియం" లో భక్తులు సమావేశమైనారు! ప్రాచీన సాంప్రదాయమునకు అనుగుణ్యంగా సభాప్రారంభమునకు ముందుగ విద్యార్థులచే వేదపఠనము గావింపబడినది. శ్రీ సత్యసాయి హైయ్యర్ సెకండరీ స్కూల్ విద్యార్థియైన చి॥ శ్రీకాంత్, బృందావనం క్యాంపస్‌కి చెందిన చి॥ అమర్‌సింగ్ మరియు బృందావనం క్యాంపస్ ప్రిన్సిపాల్ శ్రీ కె. అనిల్ కుమార్ ఉపన్యసించిరి. అటుతర్వాత భగవాన్ తమ దివ్యసందేశమును అనుగ్రహించినారు.

## వేదమూర్తికి వేదపురుషుని సత్కారం

శ్రీవారి సందేశము తదుపరి సుప్రసిద్ధుడైన, ప్రశాంతినిలయ నివాసియైన శ్రీయుత చెరుకుమిల్లి కామావధానిగారిని భగవాన్ బాబావారు సత్కరించుట జరిగినది. ఇట్టి వేదమూర్తినిగూర్చి భగవాన్ బాబావారే ఆనాటి గురుపౌర్ణమి సందేశములో శ్లాఘించుట జరిగినది.

ప్రేమ స్వరూపలారా!

"పరమభక్తుడు, వేదపురుషుడు, ముప్పది సంవత్సరములకు పూర్వం మొట్ట మొదట జరిగినట్టి "వేదపురుష సప్తాహ జ్ఞాన యజ్ఞం" నందు పాల్గొనుటకు ప్రశాంతి నిలయం చేరుకున్నాడు. ఆనాడు మొదలుకొని ఈనాటి వరకు ఏకధాటిగా, భక్తిప్రపత్తులతో స్వామి చింతన చేస్తూఉండినవాడు. ఆనాటినుండి ఈనాటివరకు, అంటే 30 సం॥నుండి తన స్వగ్రామానికి పోలేదు. అట్టి దీక్షతో ప్రశాంతి నిలయంలో కాలంగడుపుతూ ఈనాటికి "నూరు సంవత్సరములు" పూర్తిచేసుకుంటున్నాడు. నేటికికూడ ఈ వ్యక్తి వేదాన్ని చింతిస్తూ, వేదాన్ని వల్లెవేస్తూనే యున్నాడు. అతనిపేరుతో 5 సం॥ పూర్వము "వేదశాస్త్ర పరిషత్" అనే ఒక సంస్థను నెలకొల్పడం జరిగినది. ఆనాటినుండి నేటివరకు వేదాధ్యయనం చేసేవారిని ఉద్ధరించాలన్నదే ఈ సంస్థయొక్క ముఖ్యోద్దేశం. భారతీయులు వేదాన్ని తెలుసుకొనలేక, వేదార్థమును చక్కగా గుర్తించుకొనలేక పోతున్నారు. సర్వ జీవితసారమంతయు వేదములో ఇమిడి ఉంటున్నది కనుక, అతనికి ఈనాడు నూరు సంవత్సరములు పూర్తి కావడంచేత, అతని 'వేదశాస్త్ర పరిషత్' పేరుతో, మా సెంట్రల్ ట్రస్టు తరఫున "ఒక లక్ష రూపాయలు" అతనికి అందిస్తున్నాము. వేదాధ్యయనం దీనియొక్క ప్రధానలక్ష్యం. ఇంతవరకు పేర్కొన్న వ్యక్తి ఎవరంటే? — అతడే నూరు సంవత్సరములు పండినపండు చెరుకుమిల్లి కామావధాని".

వేదవిద్యలు పూర్తిగా మృగ్యమైన నేటి రోజులలో, భగవానుడవతరించి ఈ రీతిగా వేదోద్ధారణ గావించుచున్నారు. అటు తరువాత, శ్రీ కదిరి గోపినాథ్ గారి Saxophone 'వాద్యకచేరీ' తో ఆనాటి సభా కార్యక్రమము జయప్రదముగా ముగిసినది.

'కవికుమార్'

ప్రశాంతినిలయం.

# దైవశక్తియే మూలం

ఓ! వెఱ్ఱిమనసా!

"ఈ లోకములో 'బ్రహ్మదర్శన భాగ్యంబు' పొందగోరి ఎచటకలదని దానిని వెదకుటకు ప్రయత్నిస్తావు; ఆ బ్రహ్మతత్త్వము నీలోనే డాగి యున్నది. కాబట్టి అచటనే వెదకుము, నీకచటనే కనిపించును. ఇది సాయి చెప్పినమాట. అదే సత్యమైన బాట"

"ప్రేమయనెడి పంట - పండింపనలవి కాదు. ఈ ప్రేమ ఏ అంగడి యందు దొరకదు. దానిని అమ్మరు. రాజాధిరాజులైనప్పటికి, సామాన్య ప్రజలైనప్పటికి - అహంకారమును విడిచిపెట్టి, త్యాగులై దీనిని తెలుసు కొనవలెను".

ప్రేమస్వరూపులారా!

జీవయాత్ర నలిపే ప్రతీజీవికి "కర్మక్షేత్రము"న మనస్సు, వాక్కు, చెవులు, కన్నులు, ముక్కు, కాళ్ళు, చేతులు- ఇవన్నీ నిత్యోపయోగార్థమై ఏర్పడిన కరణములు. కరణములనగా పనిముట్లు. తన జీవ యాత్రలో ఉపయోగించుకొనే కరణములు కనుకనే వీనికి ఉపకరణములని మరొక పేరుకలదు. ప్రాకృత మైన ఈ జగత్తునందు ఏ విజయమును సాధించవలె నన్నా కరణ, కారణ, కర్త - ఈ మూడు అత్యావశ్యకం. ఈ కరణములు ఉపయోగించుకొనేవాడు కర్త, ఉపయోగింపబడేవాడు కారకుడు, కారకుని కోరిక కారణము. కరణ, కారణ, కర్త - ఈ మూడింటి ఏకత్వాన్ని మానవుడు గుర్తించుకొనుటయే మానవుని ప్రధాన లక్ష్యము.

సామాన్యముగా కన్నులు చూస్తున్నాయని, చెవులు వింటున్నాయని, నోరు మాట్లాడుచున్నదని మన నిత్యజీవితములో ఈ పదములను ఉపయోగ పెడుతూవుంటాము. కాని చూసేదే కన్నులైన, మాట్లాడేదే నోరైన, వినేదే చెవులైన— మానవుడు మరణించిన తరువాత ఈ చెవులు, ఈ కన్నులు, ఈ నోరు మొ॥నవి ఉండినప్పటికీ తాము తమ తమ కర్మలను ఎందుకు ఆచరించుట లేదు? ఇవి కనిపించక,

వినిపించక, పలుకక ఉండినదానికి కారణమేమనగా, వీటిని కనిపించే, వినిపించే, అనిపించే, పలికించే, తలపించే ఏదో ఒక దివ్యమైనశక్తి మానవునియందు అంతర్భూతమై ఉంటున్నదని గుర్తింపవలె.

## చిత్తశుద్ధి - దివ్యశక్తి

మానవ దేహమందు ఈ దివ్యమైనశక్తి ఉన్నంత వరకే కన్నులు, చెవులు, నోరు, చేతులు, కాళ్ళు మున్నగునవి పనిచేస్తూ ఉంటాయి. కనుక సమస్త కరణములకు ప్రాణముపోసి వాటి వాటి కర్తవ్య కర్మలను ఆచరింపజేసే దివ్యమైనశక్తి మానవుని యందు ఒకటున్నది. ఆ దివ్యమైనశక్తిని ప్రాణమని పిలువగలుగుచున్నాము. అయితే ఈ ప్రాణం ఎక్కడి నుండి వచ్చుచున్నది? ఎక్కడికి వెళ్ళుచున్నది? ఎవరు పంపుచున్నారు? ఇవే "కేనోపనిషత్తు" వేసిన ప్రశ్నలు. ఈ పలికించే, వినిపించే, అనిపించే, తలపించే, మురిపించే దివ్యమైనశక్తి ప్రాణమునకు ఉన్నదా? లేక ప్రాణముకంటే అధిపతియైన మరొక శక్తి ఏమైనా ఉన్నదా? అని విచారణ సల్పుతూ వచ్చింది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సూర్యుని వెలుతురు ఆధారం చేతనే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రుని ప్రకాశమే భూమిపైన పడుచున్నది. అప్పుడు భూమికూడా ప్రకాశిస్తున్నది. ఈ భూమి దేని వల్ల ప్రకాశిస్తున్నదంటే, చంద్రుని ప్రకాశము చేతనే. చంద్రుడు దేనివల్ల ప్రకాశిస్తున్నాడంటే, సూర్యుని ప్రకాశము చేతనే. దేనివల్ల సూర్యుడు ప్రకాశించు చున్నాడు? అని ప్రశ్నించుకుంటే అదియే దివ్యమైన శక్తి అని సమాధానము వస్తుంది. దీనిలో ఉండిన హైడ్రోజన్, హీలియం అనేవి ఏ శక్తినుండి ఆవిర్భ వించినవి? అని ప్రశ్నించుకుంటే దీనినే ఉపనిషత్తులు "బ్రహ్మతత్త్వము" అన్నాయి.

ఈ బ్రహ్మ ప్రకాశముచేతనే సూర్యచంద్రాదులు, సమస్తజగత్తు ప్రకాశిస్తున్నదనియు, కేవలం అన్నిం టినీ బ్రహ్మ ప్రకాశింపచేయునదే కాని బ్రహ్మను ప్రకాశింపచేసే వస్తువు ఏ ఒక్కటీ లేదని గ్రహింప వలెను. ఈ బ్రహ్మ ప్రకాశమే నేత్రములను చేరుట చేత నేత్రములు చూడగలుగుచున్నవి; కాని ఈ నేత్ర ములు బ్రహ్మను చూడలేకపోవుచున్నవి. మనస్సు ఈ ప్రకాశము యొక్క ఆధారమును పురస్కరించుకొని సంకల్పములను అభివృద్ధి గావించుకొనుచున్నది; కాని మనస్సు ఈ బ్రహ్మను వర్ణించలేకపోతున్నది. అందు చేతనే ఉపనిషత్తులు మానవునియందు మనస్సునకు గాని, వాక్కునకుగాని అతీతమైన దివ్యతత్త్వము ఇమిడి ఉంటున్నదని నిరూపిస్తూ వచ్చినవి. మానవుని యందు ఇట్టి దివ్యమైన, భవ్యమైన శక్తి ఇమిడి యుండియు మానవుడు దానిని గుర్తించుకొనలేకపోతు న్నాడు. మానవుడు తన జీవితమందు బాహ్యదృష్టిని అభివృద్ధిపరచుకొనుటకు ప్రయత్నిస్తున్నాడేకాని, అం తర్దృష్టిని యేమాత్రము అభివృద్ధిపరచుకొనుటకు, అను భవించుటకు ప్రాకులాడుట లేదు.

చిత్తశుద్ధి చేతనే మానవునికి ఈ సత్యమును గుర్తించుకొనుటకు సాధ్యమౌతుంది. కనుక ప్రతి మానవుడు తనయందున్న సమస్త కరణములను ఉప యోగించి, ఆ దివ్యశక్తిని వికసింపజేసే శక్తి తన యందు ఉండినప్పటికి కేవలము తానొక బలహీనుడు గను, అశక్తుడుగను భావిస్తున్నాడు ఇట్టి దివ్యమైన శక్తిని మానవుడు ఏ విధముగా విచారించాలి? దీనినే కేనోపనిషత్తు ఈ దివ్యమైన శక్తి మనస్సునకు మనస్సై, ప్రాణమునకు ప్రాణమై, నేత్రములకు నేత్రమై, శోత్రములకు శోత్రమై, వాక్కునకు వాక్కై అన్నింటిలోను అంతర్భూతమై ఉన్నట్లు తెలుపు చున్నది. కారులో లైటు వెలుగుటకు, "హారను" శబ్దము చేయుటకు, చక్రములు తిరుగుటకు, మిషను నడచుటకు- దీనికి లోపల "కరెంటు" అత్యవసరము. వెలిగే లైటు, నడిచే చక్రాలు, కదలే ఇంజను, పలికే హారను మున్నగునవన్నియు కరెంటు మీదనే ఆధారపడి ఉన్నవనే సత్యమును గుర్తించినప్పుడే,

మన ఈ సమస్త కరణములు కూడా దివ్యమైన ఆత్మ శక్తి చేత, తమ తమ ప్రభావముచేత తమ కర్తవ్యము నిర్వర్తించుకొనుచున్నవనే సత్యం మనకు అర్థమవుతుంది. పూచిన పువ్వులన్నీ కాయలు కావు, కాచిన కాయలన్నీ పండ్లు కావు, కానీ పండిన పండ్లన్నీ క్రిందపడక తప్పదు. ఇదే మానవత్వములో ఉండిన ప్రధాన రహస్యము. కాల, కారణ, కర్తవ్యము ముగియగానే కాయము శక్తిహీనమై, నిర్వీర్యమై, ప్రాణరహితమై, నిర్జీవమై నిలిచిపోతుంది.

## ఇంద్రియాధిపతి ఇంద్రుడు

ఈ జీవతత్త్వమునకు ఆధారమేమిటి? అదియే ఆత్మతత్త్వము. మానవుడు ఇంద్రియములనే ప్రధాన దృష్టితో తాను విచారణ సల్పుచున్నాడు. ఇంద్రియములకు అతీతమైన మనస్సు ఒకటి ఉంటున్నది. ఉపనిషత్తు ఈ మనస్సునే 'ఇంద్రుడు' అని పిలుస్తూవచ్చింది. అనగా ఇంద్రియములకు అధిపతియైనవాడు కనుక ఇతనికి ఇంద్రుడని మరొకపేరు. ఏతావాతా ఇంద్రుడనగా మనస్సే. ఇంద్రియములను మనస్సునందు జేర్చి, మనస్సును ఆత్మనందు చేర్చినప్పుడు ఈ మనోఆత్మ సమ్మిళితమైన స్వరూపమే దివ్యమైనశక్తి అని కేనోపనిషత్తు చెబుతూ వచ్చింది. ఈనాటి మన ఇంద్రియములను మనస్సునందు చేర్చుటలేదు, మనస్సును ఆత్మతో కూర్చుటలేదు. మనస్సును ప్రాకృతమైనదానియందు ప్రవేశపెడుతున్నాము. కనుక మనస్సు వేరు ఆత్మ వేరుగా విభాగము సలుపుతున్నారు. కాని మనస్సుయందు, ఆత్మయందు, శరీరమందు, ఇంద్రియములందు, అంతఃకరణయందు అన్నింటియందు సర్వవ్యాపకమై ఉండినది "చిచ్ఛక్తి", అదే బ్రహ్మతత్త్వము.

## దృశ్యము — ద్రష్ట

సర్వత్రా నిండిన శక్తి ఒకటి ఉన్నది. ఇట్టి సర్వశక్తిమయమైన ఆత్మతత్త్వము ప్రతి మానవునియందు సూక్ష్మరూపంలో నిల్చి ఉంటున్నది. శరీరమనోబలములను పురస్కరించుకొని మానవుడు తన తత్త్వాన్ని తాను మరచి, భౌతికమైన లోకమునే ఆధారముగా చేసుకొని అహంకారము పొందుటచేతనే, ఈ ఆత్మతత్త్వమును విస్మరిస్తూ వస్తున్నాడు. ఒక్కొక్క సమయమందు ఇంద్రియములు కేవలము దృశ్యములు మాత్రమే. ఇవన్నియూ జడస్వరూపములే. పదార్థమును చూస్తున్నవి కన్నులు: ఇది కేవలం ఒక దృశ్యము. దీనిని చూచుచున్నప్పుడు కన్నులు ద్రష్ట. కాని ఈ సమయములో ద్రష్టయైన కన్నులు మరొక సమయములోపల అవి దృశ్యములైపోతున్నాయి. ఏ విధముగా దృశ్యములవుతున్నాయంటే, కన్నులు తెరిచిఉండినప్పటికిని, ఈ మనస్సు ఎక్కడో సంచారము చేయుటచేత ఎదుటనున్న వస్తువులు కన్నులు చూడలేకపోతున్నాయి. కాబట్టి ఆ సమయమందు కన్నులు దృశ్యమైపోతున్నాయి, మనస్సు ద్రష్టగా మారిపోతున్నది.

## మనస్సు బుద్ధి ఆత్మ

మరొక సమయములోపల మనస్సే దృశ్యమైపోతుంది, బుద్ధి ద్రష్టగా మారుతుంది. విచారణ శక్తి లేని పరిస్థితియందు మనస్సు దృశ్యమైపోతుంది, బుద్ధి ద్రష్టగా మారుతుంది. నిద్రావస్థయందు మనస్సు లేదు. మనస్సు కేవలం ఒక దృశ్యంగా రూపొందుతున్నది మనస్సు కేవలం చైతన్యమైనస్థితిలో వెలుగుచున్నది. కనుక ఆ సమయమందు బుద్ధి ద్రష్ట, మనస్సు దృశ్యము. సమాధిస్థితియందు బుద్ధి దృశ్యమైపోతుంది, ఆత్మ ద్రష్టగా మారుతుంది. కనుక అన్నింటికిని ఆత్మయే ద్రష్ట. ఈ మనస్సు, ఇంద్రియములు అన్నీ దృశ్యములే. కనుకనే వీటన్నింటికిని కరణములు అని పేరు పెట్టారు. పనిముట్లు మాత్రమే. ఈ పనులు గావించేవాడు, చేయించేవాడు ఒకడు ద్రష్ట ఉంటున్నాడు. ఆ ద్రష్టయే లేకపోతే పనిముట్లు ఎంత విలువైనవైనను అన్నీ నిరుపయోగమైపోతాయి.

కొన్ని కోట్ల ధనమును వ్యయముచేసి ఒక పెద్ద మిషను తెచ్చిపెట్టారు. దాని విలువ గొప్పదే, కాని అందులో కరెంటు లేకపోతే నిరుపయోగమైన "ఇనుప ముద్ద"గా మారిపోతుంది. కనుక దేహంకూడ అటువంటిదే. ఇందులో దివ్యమైన చైతన్యశక్తి ఆత్మశక్తియే. ఇందులో సర్వకర్మలూ పనిచేయించకుండా నిలిచిపోయినప్పుడు ఇది ఒక "మాంసపు ముద్ద"గా తయారౌతుంది. ఇదొక తోలుతిత్తిగా రూపొందుతుంది. కనుక ఇటువంటి విలువలేని ఒక దేహమునకు విలువను కలిపించి దానియందున్న కరణములంతా సక్రమమైన మార్గములో ప్రవేశపెట్టి జీవితమార్గములో వీటిని సరైన కరణములుగా సార్థకము గావించుకొనుటయే మానవుని ప్రధాన కర్తవ్యము. అయితే మానవునకు ఈ ప్రాకృతమైన భావము అంత సులభముగా మారేది కాదు. "పచ్చకర్పూరపు పాదులో ఉల్లిపాయను పాతిపెట్టి, కమ్మకస్తూరిని ఎరువుగా గ్రుమ్మరించి, అందులో మంచి పన్నీరును పోసి పెంచినప్పటికి, ఉల్లిపాయ కంపు ఏమాత్రము సమసిపోదు". ఆదేరీతిగనే, అనేక జన్మలనుండి వెంటాడుతున్న ఈ ప్రాకృతమైన భావాలను ఎన్ని విధములైన సాధనలు చేయించినప్పటికిని, ఎన్ని రకములైన సత్సంగములలో ప్రవేశపెట్టించినప్పటికిని— దాని పాతవాసన ఏమాత్రము అంత సులభముగా మారేది కాదు. కనుక మొట్టమొదట మానవుడు దేహసంబంధమైన విషయాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి.

## దేహము - ఆత్మ

ఈ దేహము మలమూత్ర, దుర్గంధ మాంస రక్తములతో కూడినది. కాని, అందులోనే మాణిక్యమనే ఆత్మతత్త్వము ప్రకాశిస్తున్నది. ఈ దేహము మృణ్మయమైనప్పటికి, ఆత్మ చిన్మయంగా రూపొందుతున్నది. ఈ చిన్మయతత్త్వాన్ని చక్కగా అర్థం చేసుకోవటమే మానవుని ప్రధాన లక్ష్యం. అందుకే "జంతూనాం నరజన్మ దుర్లభం" అన్నారు. మానవుడు తనయందున్న విలువైన ఆత్మతత్త్వాన్ని ఎన్నటికీ మరచిపోకూడదు. ఈ దేహమనే ఇనుప పెట్టెలో దేవుడనే విలువైన నగ ఉంటున్నది. మనం విలువ ఇవ్వవలసినది దేహములోనున్న పరమాత్మకే గాని, ఇనుపపెట్టెతో సమానమైన దేహమునకు కాదు. కేవలం విలువైన ఆభరణములను బంగారుపెట్టెలో పెట్టినప్పుడు దొంగలు దోచుకొనిపోతారు. అప్పుడు ఇటు బంగారు పెట్టెకుగాని, అటు ఆభరణములకుగాని భద్రత యుండదు. కనుక విలువైన సుగుణములనే ధనమును విలువలేని దేహమనే ఇనుపపెట్టెలో పెట్టాలి. ఇదే సృష్టిరహస్యం. దేహము అనిత్యము ఆత్మ సత్యము. అశాశ్వతమైన దేహమునందు సత్యమైన ఆత్మ ఇమిడి ఉంటున్నది. ఆత్మధనము నిమిత్తమై మన దేహమనే ఇనుపపెట్టెను కాపాడుకోవాలి. దేహమును అలక్ష్యము చేయరాదు. మనము సత్యాన్ని గుర్తించెవరకు దేహాన్ని మనము పోషించుకొని, రక్షించుకొంటూ రావాలి. అంతేగాని, దేహమే ప్రధానమని దేహిని విస్మరించుట మానవత్వమునకు సరియైన అర్థం కాదు.

అహంకారము మనలో చేరినప్పుడు ఆత్మతత్త్వము కనుమరుగైపోతుంది. ప్రకాశించే సూర్యునకు దట్టమైన మేఘములు అడ్డువచ్చినప్పుడు సూర్యుడు మనకు కనిపించడు. మనకు సూర్యుడు కనిపించకపోయినంత మాత్రమున సూర్యుడు లేడని చెప్పగలమా? ఆవిధముగా సమాధానము చెప్పలేము. మేఘములు అడ్డురావడంచేతనే సూర్యుడు కనిపించుట లేదు. అయితే ఈ మేఘములు శాశ్వతముగా అడ్డు ఉంటాయా? శాశ్వతముగా మేఘములు అడ్డురావు. ఇవి కదలిపోయే మేఘములు. కదలిపోయిన తక్షణమే ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తాడు. కనుకనే మానవత్వంలో ఈ అహంకారము, అభిమానము అనే దట్టమైన మేఘములు చుట్టుకొనుట చేత ఆత్మతత్త్వమనేది మనకు అర్థం కావటం లేదు. ఆత్మ కనిపించలేకపోవుట చేత ఆత్మ లేదని మనం భ్రమిస్తున్నాము.

## ప్రపంచమే ఒక పెద్దస్టోరు

దేవుడు ఎక్కడున్నాడని దేవులాడుట ఎందుకు? ఆ దేవుడే నీవై ఉంటున్నావు. నీవే ఆ స్వరూపమై ఉండి నిన్ను నీవు వెదకుకొనుటకు ప్రయత్నిస్తున్నావు. దీనికి ఒక చిన్న ఉదాహరణ. ఒక "స్టోర్ రూమ్"లో సమస్త పదార్థములు ఉంటాయి. మనం ఆ రూములో ప్రవేశించి వెదకుతూ ఉంటే, అన్ని పదార్థములు మనకు కనిపిస్తాయి కాని ఒక్క పదార్థము మాత్రము కనిపించదు. కనిపించని పదార్థమేమిటి? ఆ వెదికేవాడే, వానికివాడు కనిపించని పదార్థము. కాబట్టి వానికివాడు కనిపించడు. ఇంక అన్నీ కనిపిస్తునే ఉంటాయి. కాబట్టి ఈ ప్రపంచమే ఒక పెద్ద స్టోర్. ఆ ప్రపంచమనే స్టోర్‌లో నీవు ప్రవేశించి అన్నింటిని వెదుకుచున్నావు, అన్ని పదార్థములు కనిపిస్తాయి. కాని నిన్ను నీవు చూడలేకపోతున్నావు. అదే ఒక పెద్ద దోషము, తనను తాను గుర్తించినవాడు సమస్త పదార్థములను సులభముగా గుర్తించగలడు. దృష్టి పదార్థములపై పెట్టుట చేత, ద్రష్ట మరుగై పోతున్నాడు. టార్చిలైటు వేసుకుంటూ మనము దారిలో నడుస్తుంటాము. ఈ టార్చిలైటు దారి చూపుతున్నదేగాని నిన్ను చూపుట లేదు. ఆ టార్చిలైటును నీవైపునకు మరల్చుకొన్నప్పుడు "నీకు నీవే" కనిపిస్తావు. ఇదే దివ్యమైన దృష్టి. ఈ దివ్యదృష్టిని అంతర్ముఖము గావించుకొన్నప్పుడు ఆనందమయమైన, అమృతమయమైన, అమరమయమైన ఆత్మతత్త్వము చక్కగా అర్థమవుతుంది, ప్రకాశిస్తుంది.

## గర్వము, అహంకారము పతన హేతువు

ఒకానొక సమయమందు దేవాసుర యుద్ధము జరిగిన తరువాత దేవతలకు విజయము సంభవించినది. దేవతలు విజయోత్సవము సల్పుకుంటున్నారు. ఈ విజయోత్సవ సందర్భమున తమ విజయానికి కారణమును గుర్తించుకొనలేక ప్రతిఒక్కరు "విజయకారకుడను - నేను, నేను" అంటూ అహంకారముతో విర్రవీగుతూ వెఱ్ఱివారివలె గంతులు వేయసాగినారు. ఆ అహంకారముతోనే వీరవిహారము చేస్తూ వచ్చారు. బ్రహ్మ వీరి పరిస్థితిని గుర్తించి వారికి జ్ఞాననేత్రమును తెరిపించాలని సంకల్పించుకొని యక్షరూపమును ధరించి దేవతలముందు ప్రత్యక్షమైనాడు. అగ్నిదేవుడు పట్టరాని అహంకారముతో వీరవిహారము చేయుచూ యక్షరూపమును ధరించిన బ్రహ్మముందు వచ్చి నిలిచినాడు. యక్షుడు అతని చూచి "నాయనా! నీ వెవరు?" అని ప్రశ్నించినాడు.

## అగ్నిదేవుడు

అప్పుడు అగ్నిదేవుడు ఈ విధముగా సమాధానము చెప్పడం జరిగింది. "ఓ వ్యక్తీ! నేనెవరో నీకు తెలియదా? సమస్త ప్రపంచమును క్షణములో భస్మము గావించే శక్తిసామర్థ్యములు కలిగిన మహావీరుడను. అగ్నిదేవుడను. నీకు తెలియకపోయినప్పుడు నేను చెప్పినది తెలుసుకో" అని ఒక్కక్షణంలో సమస్తం భస్మంగావించే శక్తి గలవాడనని అహంకారంతో విర్రవీగుటకు ప్రారంభించినాడు.

అగ్నిదేవుని అహంకారమును నిర్మూలము గావించాలని సంకల్పించుకొన్న బ్రహ్మ ఒక చిన్న "గరికపోచ"ను తన ముందు పెట్టుకొని "ఓ అగ్నిదేవుడా! దీనిని కాల్చుము, నేను చూస్తాను" అన్నాడు. అగ్నిదేవుడు ఈ మాటలు విని "ఇదెంతటి పని" అని అలక్ష్యముతో దానిని కాల్చడానికి ప్రయత్నించాడు. కాని అగ్నిదేవుడు ఎంత ప్రయత్నించినప్పటికి ఆ గరికపోచను ఏమాత్రము కాల్చలేకపోయాడు. తన సమస్త శక్తులను ఉపయోగపెట్టాడు. అతని ప్రయత్నములన్నియు నిరుపయోగములై పోయినాయి. కలిగిన అవమానమునకు తల ఎత్తుకొనలేక, తల వంచుకొని ప్రక్కకు వెళ్ళిపోయినాడు.

## వాయుదేవుడు

అగ్నిదేవుని తరువాత వాయుదేవుడు వచ్చి నిల్చాడు. తన శక్తిని గూర్చి యక్షరూపములో వచ్చిన బ్రహ్మకి ఈ విధముగా చెప్పుటకు ప్రారంభించినాడు. "అయ్యా! నేను వాయుదేవుడను. నా శక్తి ప్రభావము చేత నేను వీచినగాలి వలన సముద్రములంతా ఉప్పొంగిపోయి పల్లెలు, పట్టణాలు, గ్రామాలు, చెట్లులు, పుట్టలు, గట్టులు— సమస్తము కొట్టుకొనిపోతాయి. అన్నీ తలక్రిందలైపోతాయి. ఉప్పెనచేత ప్రపంచములో జరిగే ప్రమాదము నీకు తెలియుట లేదా? లేక వినుట లేదా? ఈ సాహస కృత్యములన్నియు నా మహాత్మ్యము వలననే కలుగుచున్నాయి" అని ఈ రీతిగా అనేక విధములుగా తన గర్వాన్ని, ప్రతాపాన్ని ప్రకటించడం జరిగింది. యక్షుడు ఆతనిని పరికించి "ఓహో! అంతటి శక్తిమంతుడవా?" అయితే ఆ గరికపోచను కదల్చుమని చెప్పాడు. వాయుదేవుడు తనకు గల సమస్త శక్తులను ఉపయోగపెట్టి, ఎంతో ప్రయత్నించి చిట్టచివరకు ఆ గరికపోచను కదలించలేకపోయాడు. ఇంతలోపల ఇంద్రుడు వచ్చేటప్పటికి యక్షుడు అంతర్ధానమయ్యాడు.

## ఉమ - ఇంద్రుడు

యక్షుని స్థానములో ఒక స్త్రీ వచ్చి నిలిచింది. ఆ తల్లిని చూచాడు. "మీరెవరు తల్లీ? ఇంతకు పూర్వం ఉండినవారెవరు" అని ఇంద్రుడు ప్రశ్నించాడు. "నా పేరు ఉమ. పూర్వము ఉన్నవాడు బ్రహ్మ. మీ అహంకారము మితిమీరిపోవుటచేత, మీ అహంకారాన్ని నిర్మూలనగావించి, మీ స్వస్వరూపమును దర్శింపచేసే నిమిత్తమై అతను ప్రత్యక్షమయ్యాడు. అహంకారముండినంతవరకు స్వస్వరూప దర్శనము ప్రాప్తము కాదు. కనుకనే అతడు యక్షరూపము ధరించి వచ్చాడు. యక్షరూపములో ఉన్న బ్రహ్మను మీరు బ్రహ్మగా గుర్తించుకొనలేకపోయారు. ఇంద్రియములకంతా అధిపతివైన ఇంద్రుడవు నీవు. నీవు కూడా ఆ బ్రహ్మదర్శనమునకు ఏమాత్రము అర్హుడవు కావు. కనుకనే బ్రహ్మ అంతర్ధానమైనాడు. నీవు వాంఛాస్వరూపుడవు కనుక నీ వాంఛలు నిర్మూలనము గావించే నిమిత్తమై వాంఛాస్వరూపిణియైన స్త్రీగా నేను ప్రత్యక్షమయ్యాను" అని చెప్పగా వెంటనే ఇంద్రుడు ఉమాదేవికి తన కృతజ్ఞతాభివందనములర్పించినాడు. ఈ ప్రబోధలచేత దేవతలందరూ తమ తమ అహంకారమును కొంతవరకు నిర్మూలము గావించుకొని, కన్నులు తెరిచి, జ్ఞానోదయమునుపొంది, బ్రహ్మను గుర్తించి ప్రార్థిస్తూ వచ్చారు.

## ప్రేమ బలం - భక్తి బలం

దేవతలకు అంత శక్తి ఉండినప్పటికిని, ఒక గరికపోచను కదలించలేక పోయారు. ఇటువంటి దివ్యమైన శక్తి ఆ గరికపోచకు ఎక్కడ నుండి వచ్చిందో ఎవరూ గుర్తింపలేక పోయారు. మానవుని యందు ఎంతో శక్తి ఉండినప్పటికీ, ఈ అహంకార, మమకారములనేవి మానవుని స్వస్వరూప శక్తిని కప్పిపుచ్చుతూ వస్తాయి. ఇంద్రుడు తలవంచుకొని ఈ విధముగా ప్రార్థింపసాగినాడు. "ఓ భగవంతుడా! నీ సంకల్పబలము లేనిదే గడ్డిపోచయును కదలదు, మెదలదు. అంతేగాదు అది, ఇది అని చెప్పగనేల? పిపీలికాది బ్రహ్మపర్యంతం నీవే. అది గుర్తించుకొనలేక కొందరు వివేకముగ ప్రవర్తించెదమని విఱ్ఱవీగుచుందురు. కాని చివరికి ఏ వేళ ఏమి సంభవించునో ఎంతవారలైనా తెలియలేరు. ఎన్ని తెలివితేటలు ఉండినా, ప్రయోజనము లేదు. ఎంతటి శక్తి సామర్థ్యములున్నా నిష్ప్రయోజనమే, ఎంత విద్యావంతులైనప్పటికి, మరెంతటి ధన, కనక, వస్తు వాహనాదులున్నప్పటికీ నిన్ను తెలుసుకోలేని ధన, భుజ, బుద్ధి బలములన్నియు దుర్బలములే. నిన్ను తెలుసుకొనుటకు ప్రేమ బలము, భక్తి బలము - ఈ రెండే

తప్ప ఇంకే బలములు కలిగి యున్నప్పటికిపీ, నిరర్థక ములే. ఈ భక్తి బలమునకు మించిన బలము లేనే లేదు." అని ఈ రీతిగా పల్కినాడు.

భక్తి అనగా ఏమిటి? నిస్వార్థమైన హృదయ ముతో, నిర్మలమైన భావముతో, నిరహంకారమైన చిత్తముతో భగవంతుని ప్రేమించుటయే భక్తి. కాబట్టి మానవుని శక్తి సామర్థ్యములు ఇంద్రియములందు ఏ మాత్రము లేవు. ఆ ఇంద్రియములు బ్రహ్మబలము చేతనే తమ తమ పనులు తాము చేస్తున్నాయి. మన ఇంద్రియములన్నియు కరణములు. అవే మన పని ముట్లు. మనమీ పనిముట్లను సద్వినియోగ పరచాలి.

## కన్ను - నాలుక

మన ఇంద్రియములలో కన్ను, నాలుక ముఖ్య మైనవి. మన కన్నులుంటున్నాయి. వీనికి ఒక రోగము ఉంటున్నది. ఆరోగ్యముగా ఉన్నప్పుడు కన్నులు తెలుపును తెలుపుగా, నలుపును నలుపుగా చూస్తాయి. కాని "జాండిస్" వచ్చినదంటే, అంతా పచ్చగా కనిపిస్తుంది, అది ప్రకృతి దోషము కాదు. ఇంద్రియ దోషము. అట్లే మన నాలుక ఆరోగ్యముగా ఉండి నంతవరకు తీపిని తీపిగా, కారమును కారముగా, చేదును చేదుగా గుర్తిస్తుంది. కాని మలేరియా వచ్చిం దంటే అన్ని తీపి పదార్థాలు చేదుగా అనిపిస్తాయి కాబట్టి ఇంద్రియములన్నీ రోగమయములు. అనగా రోగాలతో కూడి ఉంటాయి. కాని యోగముతో కూడినవి కావు కాని వీటన్నిటిని మనము అరికట్టు కొన్నప్పుడే గొప్ప యోగముగా రూపొందుతాయి. "యోగః చిత్త వృత్తి నిరోధకః" అనే పతంజలి సూత్రము మనకందరికీ సందర్భమున గుర్తుకు వస్తుంది మొట్టమొదట మన ఇంద్రియాలను మనము స్వాధీన ములో పెట్టుకోవాలి. మానవులు ఉద్రేకాన్ని పొంది, ఇంద్రియముల స్వాధీనము కోల్పోరాదు. తగిన శాంతమును పొందాలి. నిత్యా నిత్య విషయ పరిశీలన చేయాలి. తదుపరి ఇంద్రియములను ప్రవేశపెట్టాలి. అప్పుడే మనము ఇంద్రియాలను సరియైన పద్ధతిలో ప్రవేశ పెట్టిన వారమౌతాము.

విద్యార్థులారా! ఈ వయస్సులో ఇంద్రియా లన్ని మహా ఘాటుగా, సూటిగా, ధాటిగా పనిచేస్తుం టాయి. మానవుని కన్నులు మహాపాపమైనవి. వీరిని, వారిని చూస్తుంటాయి. దీనివలన ఎక్కువ పాపం అభివృద్ధి అవుతుంది. కన్నులున్నందుకు మంచిని చూడాలి. చెడ్డను చూడరాదు. నోరు యిచ్చినది తినుటకోసమే, కాని గడ్డిని తినుటకు కాదు. కనుక, ప్రతి ఇంద్రియమును సన్మార్గములో ప్రవేశపెట్టాలి. కొన్ని పనులు మనము చేసే సమయములో మంచి చెడ్డలను విచారించవలెను. పనులు చేసిన తరువాత ఆ మంచిచెడ్డల యొక్క ఫలితమును అనుభవించక తప్పదు. చెడ్డ దృష్టి, చెడ్డ మాటలు, చెడ్డ ఆలోచనలు, చెడ్డ పనులు కంట్రోల్‌లో పెట్టు కొన్నచో అదే నిజ మైన ఆధ్యాత్మిక మార్గమౌతుంది ఈ రీతిగా మీరు సాధించినప్పుడు క్షేమం కలుగుతుంది.

## ఏది తప్పినా, ఇది తప్పదు

యవ్వనము చాలా అహంకారముతో కూడి యుంటుంది. అందులో మానవుని యవ్వనము క్షణభంగురము. మంచువలె కరిగిపోతుంది. ఇట్టి క్షణ భంగురమైన ఇంద్రియ సుఖములకు, యవ్వనమునకు మురిసిపోయి, మన భవిష్యత్తును భస్మము చేసుకుం టున్నాము ఇప్పుడే ఇంద్రియాలను అదుపులో పెట్టు కోవాలి. ఇదే "కేనోపనిషత్తు" ఋషులకు, దేవత లకు, మానవులకు బోధించిన సద్బోధ. అంతేకాదు. ఇటు దేవతలకు, అటు మానవులకు సరియైన ఆద ర్శాన్ని నిరూపి స్తూవచ్చింది. "ఓ మానవుడా! నీవు చేసే పాపఫలము గాని, పుణ్యఫలము గాని వెంటనే నీకు చిక్కేది కాదు. గోవునుండి పాలు పితికినట్లు తక్షణమే లభించేది గాదు. నాటిన విత్తనము వంటిది" అని కేనోపనిషత్తు తెలుపుచున్నది. నాటిన తక్షణమే విత్తనము వృక్షమై ఫలాన్ని

మనకు అందించదు. నాటిన విత్తనము, వృక్షముగా మారటానికి చాలా కాలము పడుతుంది. ఈనాడు నీవు పాపము చేసిన తక్షణమే "నాకేమి ఫలము వచ్చింది. నాకేమి రాలేదే!" అని విఱ్ఱవీగవద్దు. ఈ విత్తనము ఫలవంతమైపోయి ఆ ఫలము నీవనుభవించడానికి కొంత కాలం పడుతుంది. ఇది ఎప్పటికీ, ఎన్నటికీ తప్పదు. ఏది తప్పినా ఇది తప్పదు. కర్మఫలమును అనుభవించక తప్పదు. కాబట్టి బాల్యములో మనస్సును పవిత్రమైన మార్గములో ప్రవేశ పెట్టుకోవాలి.

## నాలుక ప్రాశస్త్యం

వాక్కు యొక్క తత్త్వాన్ని గుర్తించుకోవాలి. వాక్కు చాలా పవిత్రమైనది.

" జిహ్వే రసజ్ఞే మధుర ప్రియే త్వం । సత్యం హితం త్వాం పరమం వదామి । ఆవర్ణయేథా మధురాక్షరాణి ।
గోవింద ! దామోదర ! మాధవేతి ".

ఈ నాలుకను గూర్చి జయదేవుడీరీతిగా వర్ణించాడు. "ఓ రుచి యెఱిగిన నాలుకా! ఓ పవిత్రమైన నాలుకా! సుస్మితమైన మధుర భాషలాడే నాలుకా! దివ్యమైన వాక్కులతో కూడినదానా! వాణిశ్రీని అభివృద్ధిపరచే నాలుకా! సరస్వతీ స్వరూపమైన నాలుకా! నీవు ఎంత పవిత్రమైన నాలుకవు! కాబట్టి నీవు అనవసరమైన మాటలలో ప్రవేశించవద్దు. మధురమైన ఆనందమునందించే గోవింద నామస్మరణ" చేయి. అపవిత్రమైన మాటలను ఉపయోగపెట్టవద్దు. ఇది నీకు మంచిది కాదు. అపవిత్రమైన మాటలను ఉపయోగపెట్టినచో, దాని పాపపరిహార నిమిత్తమై "గోవిందా! దామోదరా!, మాధవా!" అనే నామస్మరణ చేయవలసి యుండును- అని బోధించినాడు జయదేవుడు.

నాలుక ఎంతత్యాగాన్ని, ఎంత గౌరవాన్ని, ఎంత మర్యాదను, విశాలతను కలిగి ఉంటుందో మనం గుర్తించుకోవాలి. ఒక ఫలమును నాలుక భుజించడానికి ప్రయత్నించినప్పుడు ఆ ఫలము పుల్లగా, చేదుగా ఉంటే, జఠరాగ్నికి పంపుట న్యాయము కాదని ఆ నాలుక ఆలోచన చేస్తుంది. ఈ ఫలము భగవంతునికి నైవేద్యము చెయ్యాలి. కాబట్టి ఈ ఫలము మధుర ఫలము కాదు అని భావించి, "ఓ భూదేవతా! ఈ ఫలాన్ని నీవే సృష్టించినావు కాబట్టి నీవే అందుకో" అన్నట్లుగా నోటినుండి బయటకు ఉమ్మేస్తుంది. అదే ఫలం మధురాతి మధురంగా ఉంటే, "ఓ మాధవా! ఈ మధురాతి మధురమైన ఫలాన్ని అనుభవించు" అని జఠరాగ్నికి పంపుతుంది. తాను యేమాత్రము అనుభవించదు. మంచిని భగవంతునికి ఇస్తుంది, చెడ్డను ప్రకృతికి విసిరివేస్తుంది. ఇంత త్యాగము కలిగినది ఈ నాలుక. ఎంత ఓపిక! మరెంతటి శాంతము!

## విభీషణుడు - హనుమంతుడు

ఆ ఓపిక యేమిటంటే, సూటియైన అంబుల వంటి 32 దంతములుండగా వాని మధ్యలో ఈ మెత్తని నాలుక ఎంత జాగ్రత్తగానో, చక్కగానో మెలగుతుంది. ఈ ఉపమానమును పురస్కరించుకొనియే ఒకానొక సమయములో విభీషణుడు హనుమంతునితో ఈ విధంగా చెప్పడం జరిగింది, "హనుమంతా! ఈ రాక్షసులవంటి దంతముల మధ్య రామనామమును స్మరించే నాలుకవలె నేను జీవిస్తున్నాను. ఏ కించిత్తు నేను అటు ఇటు అజాగ్రత్తపడినా— ఈ రాక్షసులనే దంతముల మధ్య నా జీవితము ఏనాడో అంతమైపోయేది. కనుక ఈ నాశనము కాకపూర్వమే, నామాన్ని స్మరిస్తున్నాను. కాబట్టి రూపాన్ని కూడా దర్శింపజేసుకునే భాగ్యాన్ని కల్గించు" అని విభీషణుడు, హనుమంతుని ప్రార్థించాడు. విభీషణుడు పలికిన పలుకులు విని హనుమంతుడీవిధముగా సమాధానము చెప్పడం జరిగింది. "ఓ విభీషణా! ఈ రాక్షసులను దంతములుగాను, నిన్ను నీవు నాలుకగాను పోల్చుకుంటున్నావు, చాలాబాగున్నది. కాని ఒకమాట చెబుతాను విను! దంతములు ముందురాలుతాయా? లేక నాలుక

ముందు రాలుతుందా? అంటే దంతములే ముందు రాలిపోతాయి. నీవు భయపడనక్కర లేదు. నాలుక ఎన్నటికీ రాలదు. కనుక నీవు నాలుకవంటి వాడవు. కాబట్టి రామసన్నిధికి నీవు తప్పక చేరుకుంటావు. దంతములవంటి ఈ రాక్షసులందరు నీ ముందుగానే రాలిపోతారు, కూలిపోతారు. యోచింపనక్కర లేదు" అని ధైర్యం చెప్పాడు.

కాబట్టి నాలుక ఇంత పవిత్రమైనది, సున్నితమైనది, గౌరవాన్ని అందింపచేసి, అందుకొనేటటువంటిది. అంతేకాదు. మహారాణివలె మర్యాదగా జీవిస్తుంది. ఇంతేకాదు. లోకములో ఏమైనా లోపాలు, చెడ్డపనులు జరిగినప్పుడు, చేసినప్పుడు— "ఛీ పశువా!" అని అతణ్ణి దూషిస్తుంది. అదే నాలుక మంచిపనిచేసినప్పుడు "ఆహా! నీవు పశుపతి వంటి వాడవు" అని వర్ణిస్తుంది. కనుక, ఇటు దూషించుటకు, తిరస్కరించుటకు, అటు భూషించుటకు, గౌరవించుటకు— నాలుకయే ముఖ్యపాత్ర వహిస్తుంది. ఇటువంటి పవిత్రమైన నాలుకను మనము పవిత్రమైన మాటలలో ప్రవేశపెట్టాలి. గౌరవాన్ని, వాత్సల్యాన్ని చేపట్టాలి. ఈనాడు ఉపనిషత్తులు బోధిస్తున్న మధురమైన మంచిమాటలను విస్మరిస్తున్నాము.

సమస్త వేదముల సారమే ఉపనిషత్తు. ఉపనిషత్తుల తత్త్వాన్ని, సారాంశాన్ని ఎవ్వరు అర్థం చేసికొనటానికి ప్రయత్నించుట లేదు. చిన్న చిన్న మాటల చేతనే సమస్త ఉపనిషత్తులు మానవుని అజ్ఞానమనెడి అనారోగ్యమును నివారిస్తున్నాయి. ప్రజ్ఞాజ్యోతిని ప్రజ్వలింపజేస్తున్నాయి. కాబట్టి విద్యార్థులు చాలజాగ్రత్త వహించి ఈ వయస్సునందే పవిత్రమైన జీవితాన్ని గడపగలందులకై తగిన కృషిని చేయాలి.

## విద్యతోబాటు వినయాన్ని పెంచుకో

విద్యతోపాటు వినయాన్ని పోషించుకోవాలి. వినయమే లేకపోతే- ఆ నేర్చిన విద్య కేవలం నిరుపయోగకరమే. తల్లిదండ్రులను, పెద్దలను గౌరవించండి. చిన్నవారిని ప్రేమించి లాలించండి. నేటి విద్యార్థులలో అధికమైన సంభాషణ చేయుటలో— కూరత్వము పెరిగిపోవుచున్నది. అందువలన కార్యసాఫల్యము, కార్యశూరత క్షీణించి నశించిపోవుచున్నది. నేటి బ్రతుకులన్నియు ఆడంబరములపాలై బజారుపాలైనవి. అందుచేత, నేటి విద్యార్థులు ఆడంబరమునకేమాత్రం చోటివ్వరాదు- అవకాశమీయరాదు.

ఆకాశంపై మేఘాలు చేరినప్పుడు, వాటిదాపున విద్యుల్లత ఏరీతిగా ప్రకాశించుచుండునో, అదేరీతిగా- "విద్య వెనుక విజ్ఞానంబు వెలయునట్లు"- విద్యార్థులు సంచరించుకోవాలి. అంతేకాదు. నల్లనైన మబ్బుల మధ్యన మంచు ఏరీతిగా ప్రకాశిస్తుందో అదే పద్ధతిగా అంధకారమైన యీ జగత్తులోపల మన విద్య "విద్యుల్లేఖ" వలె శోభాయమానముగా ప్రకాశించాలి. ఆరీతిగా మెలగాలి, తిరగాలి, వెలగాలి. కేవలం "బుక్కిష్ నాలెడ్జి"ని హృదయంలో పెట్టుకొని వాదోపవాదములకు దిగరాదు.

వితండవాదనకు విద్య చాలా విరోధము. ఏ పదార్థములేని ఖాళీవిస్తరి ఎగిరిపడినట్లు, ఏమీతెలియని వాడే వాదనలో పాల్గొంటాడు. అన్నీ వడ్డించిన విస్తరి అణిగిమణిగి పడియుంటుంది. అదేరీతిగా, అన్నీ తెలిసినవాడు నిశ్శబ్దంగా ఉంటాడు. కాబట్టి మనము అన్నీ వడ్డించియున్న విస్తరాకువలె, అణిగిమణిగి యుండాలి. ఆరీతిగా కాలం గడపాలి, నడచుకోవాలి. అన్నీ వడ్డించిన విస్తరివలె పరిపూర్ణమైన వ్యక్తులుగా తయారుకావాలి. ఆ రీతిగా ప్రవర్తించాలి. ఈ విధానము విద్యార్థులకెంతేని సులభమైన, సరియైన రాజమార్గము.

## విద్యార్థులు అభయహస్తం అందించాలి

విద్యార్థులారా!

ఈ వయస్సులో అహంకారం, అభిమానం, ఆడంబరం— అనేవి అమితంగా ఉంటాయి.

దీనికంతకు ముఖ్య కారణము ఆహార, విహార దోషములే. కాబట్టి ఆ దోషములకుందగిన పరిహారం గావించుకోవాలి. మనము దోషులము కాకూడదు— పవిత్రులము కావాలి.

మన విద్యార్థులు అభయస్వరూపులుగా రూపొందాలి. భయపడే వారికి "అభయ హస్తం" అందించాలి. ప్రేమతత్త్వంతో అందరినీ ఆకర్షించుకోవాలి. ఏ విధముగా Magnet ఇనుమును ఆకర్షిస్తుందో, అదేవిధముగా యావత్ప్రపంచాన్ని, సమాజాన్ని ఆకర్షింపజేసుకోవాలి. అందరితో కలసి మెలసి తిరగాలి. ఈ విషయాన్ని వేదము ఈ రీతిగా చెప్పింది, "సహనా వవతు సహనౌభునక్తు సహ వీర్యం కరవావహై తేజస్వి నా వధీత మస్తు మావిద్విషా వహై" కలసిమెలసి తిరగాలి, కలసిమెలసి పెరగాలి. తెలుసుకొన్న తెలివిని కలసిమెలసి పోషించుకోవాలి. కలతలేక కలసిమెలసి కలిమితో జీవించాలి. ఇదే మనం లోకానికి అందించే శాంతి. కనుక "లోకశాంతి"ని మనము కావాలనుకొన్నప్పుడు అందరితో కలతలేక, కలసిమెలసి, కలిమిగ జీవించాలి.

## ఆనాటి పరిశోధనలు - ఈనాటి పరిశోధనలు

ఈ ఉపనిషత్తుల భావములు ఎంత పవిత్రమైనవో మీరు ఒక్కసారి మీ హృదయంలో ఆలోచించుకోవాలి. ఆనాటి ఋషులు తెలివితేటలు లేనివారు కాదు. వారు ఈనాటి సైంటిస్టులకంటే ఎక్కువ పరిశోధనలు గావించినవారే. వారు చేసిన పరిశోధనలు ఈనాటి వ్యక్తులు వేయింట ఒక్క భాగమైనా చేయుట లేదు. వారు జీవితమంతా పరిశోధనలు చేస్తూ వచ్చారు.

ఈనాటి సైంటిస్టులు చీకటి గదిలో కూర్చుని పరిశోధనలు చేస్తున్నారు. ఈ పరిశోధనలన్నీ కేవలము బావిలో కప్పల వంటివి. ఆనాటి పరిశోధనలు సముద్రములో ఉన్న కప్ప సంచారముగా జరిగియుండినవి. వారు విస్తారమైన పరిశోధనలు చేస్తూ వచ్చారు. ఈనాటి పరిశోధనలు కేవలం స్వార్థము, స్వప్రయోజనము— ఈ రెండింటితో కూడి ఉంటున్నవి. ఆనాటి వారి పరిశోధనలు నిస్స్వార్థం, నిరహంకారములతో మిళితమైన పరిశోధనలు. ఈనాడు ఆనాటి ఋషులను మనము హాస్యాస్పదంగా, ఎందుకూ పనికిమాలిన వ్యక్తులుగా భావిస్తున్నాము— ఇది చాలా పొరపాటు. వారు ప్రసాదించిన దివ్యమైన ఆధ్యాత్మిక మణులే ఈనాటి మానవత్వాన్ని ప్రకాశింపజేస్తూ వస్తున్నాయి. ఈ ఉపనిషత్తులు, శాస్త్రాలను మధించి అందించిన సుధాకలశాలు.

మీ నిత్యజీవితములో ఉపనిషత్తులలోని భావాలను అవసరమైన మార్గములో ప్రవేశపెట్టుకుంటూ మీ జీవితాన్ని సార్థకము చేసుకోవాలి. భగవన్నామ స్మరణ గావిస్తూ, ప్రశాంతమైన జీవితాన్ని గడుపుకుంటూ, దివ్యమైన జీవితాన్ని అందుకుంటూ, నేటి అల్లకల్లోల పరిస్థితులలో అశాంతి మితిమీరిన సమయములో ఆదర్శవంతమైన విద్యార్థులై ఆనందాన్ని, భద్రతను చేకూరుస్తూ, చేకూర్చుకుంటూ ఉంటారని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యబోధ
25—5—1991,
బృందావనం.



# సృష్టి రహస్యం

పరోపకారాయ ఫలంతి వృక్షాః । పరోపకారాయ వహంతి నద్యః.
పరోపకారాయ దుహంతి గావః । పరోపకారార్థ మిదం శరీరం.

పరోపకార నిమిత్తమై వృక్షములు తమ, తమ ఫలములను లోకానికి అందిస్తున్నవి. అంతేగాని తమకు కలిగిన ఫలములు కదా ! అని తాము భుజించుట లేదు. పరోపకార నిమిత్తమై లోకములో- నదులు ప్రవహిస్తున్నవి కాని తమ జలములను తాము త్రాగుట లేదు. అదే విధముగనే ఈ జగత్తులో గోవులు తమ క్షీరమును పరోపకార నిమిత్తమై అందించుచున్నవి. తమ నుండి వచ్చిన పాలు కదా ! యని తాము త్రాగుట లేదు. ఈ శరీరము ధరించినది కూడా పరోపకార నిమిత్తమే గాని స్వసౌఖ్యములకోసం కాదు."

ప్రేమస్వరూపులారా !

వృక్షములు, నదులు, గోవులు ఇంతటి త్యాగ భావాన్ని కలిగియుండినప్పుడు మానవుడు కూడా తన శరీరాన్ని పరోపకార నిమిత్తము వినియోగ పెట్టవలసి యుంటుంది. కాని అట్టి సత్యాన్ని విస్మరించి స్వార్థ స్వప్రయోజనములతో, సంకుచిత భావములతో మానవుడు కాలము గడుపుతున్నాడు. ఈనాటి మానవునికి వృక్షములకు, పశువులకు, నదులకు ఉన్న త్యాగ భావములో వేయింట ఒక భాగమైనా లేదు. తెల్లవారినది మొదలుకొని రాత్రిపరుండు వరకు— స్వార్థము ! స్వార్థము ! ఈనాటి దేశ, కాలపరిస్థితులు ఇన్ని రకములైన అవస్థలకు గురికావటానికి కారణం కేవలం మానవుని స్వార్థ, స్వప్రయోజనములే. ప్రతీవ్యక్తికి స్వార్థ, స్వప్రయోజనములు- రెండూ అవసరమే. కాని ఆ రెండు కొంత హద్దులో ఉండాలి. అందులకే "వశేప్రియో నియమం వినా" అని చెప్పబడినది. నేడు మానవులయందు దివ్యత్వము ఏమాత్రము గోచరించుట లేదు. మానవుడు మానవునిగా జీవించుటకు ప్రయత్నించుట లేదు మానవుడు మానవునిగా జీవిస్తే, అదే నిజమైన జీవితపరమార్థం, మానవత్వం అవుతుంది.

## పరార్థం - పదార్థం

"ఈ చరాచర ప్రపంచములో - ఏది కలదని పలుకుచుంటిమో, అదే లేదు. ఏది లేదని చెప్పుచుంటిమో, అదే కలదు. ఈ జగత్తులో ఎన్నటికిని ఉన్నది ఒక్కటే, అదే దైవస్వరూపం. అట్టి దైవ స్వరూపాన్ని పరికింపరయ్యా!"

జగత్తంతయు దైవత్వంలో ఇమిడి ఉంటున్నది. కాని జగత్తు ప్రత్యేకముగా లేదు. జగత్తు వేరు, దైవత్వం వేరు కాదు. అందుచేతనే "విశ్వం విష్ణుమయం జగత్", "సర్వం ఖల్విదం బ్రహ్మ", "ఈశావాస్య మిదం సర్వం" ఇటువంటి విషయాలను గూర్చి, ఏకత్వమును గూర్చి ప్రశ్నోపనిషత్తు చక్కని ప్రబోధలు సల్పుతూ వచ్చింది. ప్రతి పదార్థమునకు ఒక పరార్థము అనేది ఉంటుంది. పరార్థము ఆధారము లేక పదార్థము గోచరము కాదు. ప్రాణము లేని ప్రాణికి అస్థిత్వము శూన్యము. అదే విధముగనే పరార్థము లేని పదార్థము నిరుపయోగము. పరార్థము మూలము, పదార్థము స్థూలము. పరార్థము ఆధారము, పదార్థము ఆధేయము. భౌతిక దృష్టితో దీనిని పరికించినపుడు ఈ రెండును పరస్పర విరుద్ధముగా గోచరిస్తూ ఉంటాయి. కాని తత్త్వ దృష్టితో చూచినపుడు ఈ ప్రాణములేని ప్రాణి కాని, ఆధారము లేని ఆధేయము కాని, జడము లేని చైతన్యము గాని, చైతన్యము లేని జడముకాని జగత్తులో కానరాదు. ప్రాణము వలననే ప్రాణి ప్రకటితమౌతుంది. ప్రాణియందు ప్రాణము ఉంటున్నది. దీనినే వైదిక విజ్ఞానము, ఆధునిక విజ్ఞానము___ Matter and Energy ఈ రెండింటిని సమన్వయము గావిస్తూ వచ్చాయి. "శివశక్తి" యొక్క రసస్వభావము అనేది ఏకత్వమైన దివ్యత్వముతో కూడినదనే సత్యాన్ని ప్రశ్నోపనిషత్తు వివరిస్తూ వచ్చింది.

## ఉపనిషత్తుల ప్రబోధం

వైజ్ఞానికమునకు గాని, తత్త్వశాస్త్రమునకు గాని ఏమాత్రము భిన్న భేదములు కనిపించవు. కేవలము భౌతిక విజ్ఞానము పదార్థముతో కూడినట్లుగా మనము భావిస్తున్నాము. తత్త్వశాస్త్రమనేది పరార్థముతో చేరినట్లుగా భావిస్తున్నాము. పదార్థ పరార్థములు రెండు అవినాభావ సంబంధములు, అన్యోన్యాశ్రయములు. ఇట్టి ఏకత్వము ప్రకటించేదే ఉపనిషత్తు. ఈనాడు దురదృష్టవశాత్తు ఉపనిషత్తులన్ని పరార్థమును ప్రబోధించునవే కాని పదార్థమునకు సంబంధము లేదని భావిస్తున్నారు. ఆధ్యాత్మికమనగా కేవలము భౌతికమైన ప్రపంచముతో సంబంధము లేదని భ్రమిస్తున్నారు. భౌతికమునకు, ఆధ్యాత్మికమునకు ఎట్టి సంబంధము లేదని విశ్వసిస్తున్నారు. ఇది చాలా పొరపాటు. ఒకటి ఆధారము. రెండవది ఆధేయము. ఒకటి ప్రాణం, రెండవది ప్రాణి. ఈ రెండింటి చైతన్యము యొక్క సమన్వయమే నిజమైన జగత్తు. ఈ జగత్తును మనము విస్మరించి, దివ్యత్వమును విశ్వసించటము - ఇది కేవలము సంకుచిత స్వభావమే. జగత్తునకు దివ్యమైన శక్తికి సన్నిహిత సంబంధమున్నదనే విశ్వాసాన్ని మనము అభివృద్ధి పరచుకోవాలి. ఈ జగత్తు లేకుండిన ఏ ఒక్క విషయాన్ని మనము అర్థము చేసుకోలేము. జగత్తే లేకుండిన ఏ సత్యాన్ని మనము గుర్తించలేము. "ఏది సత్యము, ఏది మిథ్య" అని మనము భావిస్తున్నామో - ఈ రెండింటికిని జగత్తే మూలకారణం. జగత్తును వదిలిపెట్టి మనము ఏదో ఒక విజయాన్ని సాధిస్తున్నామంటే- ఇది కేవలం అసాధ్యం. జగత్తును ఆధారము చేసికొని, దివ్యత్వమును అనుభవించుటకు ప్రయత్నించాలి. కనుకనే మానవత్వములో ఉన్న దివ్యత్వాన్ని కొంతవరకు మనము అనుభవించాలంటే, మానవత్వాన్ని మనము ఆధారము చేసికోవాలి.

## పిప్పలాదమహర్షి సందేశం

ఒకానొక సమయమున సుకేశ, సత్యకామ, సౌర్యాయణి, కౌశల్య, భార్గవ, కబన్ధి — ఈ ఆరుగురు విద్యార్థులు మహా జిజ్ఞాసువులై, సత్యాన్ని గుర్తింపగోరి, సత్యాన్వేషణ చేయుటకోసమై, జీవిత పరమ రహస్యమును తెలిసికొనుటయే తమ కర్తవ్యముగా భావించుకొని, మానవత్వమును సార్థకం చేసికొనుటకై పిప్పలాదమహర్షి దగ్గరకువచ్చినారు. ఆ మహర్షిని సమీపించి అత్యంత భక్తిశ్రద్ధలతో, వినయవిధేయతలతో నమస్కరించి, "మహర్షీ! జగత్తు యొక్క ఉత్పత్తికి కారణమేమిటి? మానవ జీవితము యొక్క పరమావధి ఏమిటి? ఈ రెండు విషయాలను బోధించి మా సంశయాన్ని తీర్చండి" అని ప్రార్థించారు.

పిప్పలాదమహర్షి ఇలా సమాధానం చెప్పినాడు. "నాయనలారా! ఇటువంటి జిజ్ఞాస మీకు రావడం చాలా అదృష్టమే. కాని ప్రతి ఒక్కదానికి ఒక అధికారం ఉంటుంది, ఉండాలి. అధికారములేని తత్త్వములో మేము చెప్పే సమాధానము మీరు అర్థం చేసుకోలేరు. ప్రతి చిన్నవిషయమునకు తగిన అధికారము ఉండాలి. అనగా ఏ సమాధానముకోరి ప్రశ్నిస్తారో, ఆ సమాధానమును కూడా అర్థం చేసికొనే శక్తి ఉండాలి". ఒక పేషంట్‌కి మందు ఇవ్వాలనుకొంటే, ఆ పేషంట్ ఆ డాక్టరు ఆధీనములో ఉండాలి. ఒక బ్రిడ్జి కట్టాలను కొంటే ఒక ఇంజనీరుకు అధికారము ఉండాలి. అదే విధముగనే, జగత్తునందు నిత్య జీవితములో అనుభవించే ప్రతివిషయమునకు ఒక అధికారము ఉండాలి. పాత్రను పురస్కరించుకొనియే దానికి తగిన పదార్థం ఆధారముగా ఉంటుంది. "మీ వాంఛలు ఉత్తమమైనవే. కాని కొంత కాలముపాటు చక్కగా విచారణ శక్తితో, నిత్యానిత్య పరిశీలనతో అర్థము చేసికొనే పద్ధతికి ప్రయత్నించండి. తొందరపాటు మంచిది కాదు. తొందరపాటు చేత తెలుసుకోవలసిన పరమ సత్యాన్ని గ్రహింపలేక దూరమైపోతారు. ఈ తొందరపాటు వలన కాలము, కాయము, కర్మ — మూడింటిని వ్యర్థము చేసికొంటున్నాము. జీవితము రావటమే పరమావధి యొక్క సంకల్పము. పరమావధిని గుర్తించవలెనన్న తగినంత ఓపికను సాధించవలెను. పిల్లలారా! మీరు ఏమాత్రము తొందరపాటుకు ప్రయత్నించకండి. శాంతముతో దీనిని సాధించుకొనుటకై కొంతకాలము ఆశ్రమమునందే నిల్చి, ఇక్కడ ఉన్న నియమములను పాటించి, ఆజ్ఞలను శిరసావహించి. మీరు మీ మీ జీవితాలను గడపండి" అని పిప్పలాదమహర్షి పలికినాడు.

## కబన్ధి సందేహనివారణ

ఒక సంవత్సరం జరిగిన తరువాత కబన్ధి అనే శిష్యుడు వచ్చి, "స్వామీ! సంవత్సరము నుండి మీ వద్ద ఆశ్రమములో జీవిస్తున్నాను. నాలో సంకల్పమనేది నానాటికి అధికమగుచున్నది. నా సందేహము ఆలకించి, ఆ సందేహమును తీర్చి మనశ్శాంతిని చేకూర్చుడు" అని పల్కి ఈ రీతిగా తన సందేహమును వ్యక్తపరచినాడు: "సృష్టికి మూలకారకుడెవ్వడు? జీవరాసులన్నిటిని సృష్టించే వారెవ్వరు?" అని అడిగినంతనే పిప్పలాద మహర్షి చిరునవ్వుతో "నాయనా! ఇదంతయు ప్రజాపతి ఉత్పత్తి" అని తెలుపగానే, కబన్ధికి మనస్సు విరిగిపోయినది. "ఇంత కాలము నేను సేవ చేసినందుకు ఇదేనా సమాధానం?" అని మనస్సున చింతించి, తిరిగి కబన్ధి "ప్రజలను సృష్టించినవాడు ప్రజాపతి అంటున్నాము, కాని ఈ ప్రజాపతి ఎవరు?" అని ప్రశ్నించినాడు. వెంటనే పిప్పలాదుడు అన్నమే ప్రజాపతి అనియు, ఈ అన్నము ద్వారానే మానవత్వము ప్రాప్తిస్తున్నదని తెలిపినాడు. తిరిగి కబన్ధి, "ఈ అన్నమునకు మూలకారణమేమిటి?" అని ప్రశ్నించినంతనే, "నాయనా! వరుణుడు ఈ అన్నమునకు మూలకారకుడు. వరుణుని వలననే పంటలు పండుచున్నవి. మొట్టమొదట మన

ప్రవర్తన అత్యవసరమైనది. ఎట్టి మంటనో అట్టి పొగ, ఎట్టి పొగనో అట్టి మేఘము, ఎట్టి మేఘమో అట్టి వర్షము, ఎట్టి వర్షమో అట్టి పంట, ఎట్టి పంటనో అట్టి వంట, ఎట్టి వంటనో అట్టి జీవితం. కనుక మానవ జీవితమునకు ఆహారమే మూలాధారం. ఈ జగత్తునందు ఆహారము చేతనే మానవత్వము ఆవిర్భవిస్తున్నది. అయితే దీనికి ఒక మూలాధారం ఉంటుంది. ఆ ఆధారమేమిటంటే, సూర్యుడు— ప్రాణము, చంద్రుడు— జడము. ఈ జడ చైతన్యముల సమ్మిళిత స్వరూపమే సృష్టికి మూలకారణం. జగత్తునందు జడ చైతన్యములు రెండు సహజంగానే ఉద్భవిస్తాయి. ప్రాణము, ప్రాణి సహజముగానే ఉద్భవిస్తాయి. ఈ రెండింటి సమ్మిళితమైన స్వరూపమే సృష్టికి మూలకారణం. సూర్యకిరణములు దేదీప్యమానంగా, నలుదిశలా ప్రాకుతుంటాయి. ఈ కిరణములు జఠరాగ్నియందు ప్రవేశిస్తున్నాయి. ఈ జఠరాగ్నియందు ప్రవేశించి, తద్వారా ఉత్పత్తికి మూలకారణం అవుతున్నాయి. ఈ జగత్తులో ఉన్న మృణ్మయమైన మట్టికిగాని, కాష్ఠమయమైన వృక్షమునకుగాని, శిలామయమైన పర్వతమునకుగాని, మాంసమయమైన దేహమునకుగాని— సూర్యకిరణములు అత్యవసరము. దీనియందే ప్రాణశక్తి ఇమిడి ఉంటున్నది. ఈ ప్రాణశక్తి ద్వారానే జగత్తంతా ఆవిర్భవిస్తున్నది. ఆవిర్భవించిన జగత్తును సూర్యకిరణములే సంరక్షణ గావిస్తున్నవి. కనుక సృష్టి, స్థితి, లయములకు మూలకారణము సూర్యభగవానుడే".

## జీవిత పరమావధి

ఈ విధమైన జవాబులు చెపుతూ, "నాయనా! ఈ కాలమందలి విద్యార్థులు తమ శక్తిసామర్థ్యములను గుర్తించక, తమ కోరికలను తీర్చుకొనుటకై అనేక యత్నప్రయత్నాలు చేస్తుంటారు. అందుచేతనే విఫలమనోరథులై, నిరాశచేత, నిస్పృహచేత అలజడి చెందుతూవుంటారు. తన శక్తిని తాను గుర్తించుటకు తగిన ప్రయత్నము చేయుట లేదు. మంచి చెడ్డలను, తన తత్త్వాన్ని చక్కగా గుర్తించుకోవడానికి ప్రయత్నించాలి. ఈనాటి మానవుడు తన జీవిత పరమావధి ఏమిటని ఎన్నడు, ఏ ఒక్కడు విచారణ చేయుట లేదు. ఏనాటికో, ఏనూటికో, ఏకోటికో ఏ ఒక్కనికో ఈ సందేహం కలిగి తీరుతుంది. ఆ విచారణయే జీవిత పరమార్థమునకు ప్రథమ సోపానం. ఈనాడు అనేక మంది జనులు జీవితపరమార్థమంటే- కడుపునిండా తిండి, కంటినిండా నిద్ర, వంటినిండ బట్ట, ఇంటినిండ పిల్లలు మున్నగు విషయములే అని భావిస్తారు. ఇదికాదు జీవితపరమార్థం. ఈ రీతిగనే పశుపక్ష్యాది మృగాలు కూడా ఈ లక్షణాలను కలిగి ఉంటున్నాయి. మానవ జీవితం యొక్క పరమావధి ఏమిటని ప్రశ్నించుకుంటే, "మానవుడు తిని, ఊరికే కూర్చునే స్వభావము కలవాడు కాదు" అని సమాధానం వస్తుంది. అంతేకాదు మానవుడు తిని తిరుగుతాడు తాను కేవలం తిరగడమే కాదు. తిరిగి తిరిగి విషయాన్ని కనుక్కుంటాడు. ఏది మంచిదో అది గ్రహించి, దానిని అభివృద్ధి గావించుకుంటాడు. అభివృద్ధి గావించుకొన్న మంచిని ఆచరిస్తాడు. తానా మంచిని గ్రహించి తాను ఆచరించడమే కాకుండా, ఆచరించిన మంచిని పదిమందికి అందిస్తాడు. ఈ రీతిగా ఎవడు ఆచరిస్తాడో వాడు జీవిత పరమావధిని పొందగలుగుతాడు. చేప ఏవిధంగా జలములో సంచరించి, ఆ జలమందున్న మాలిన్యమును తాను భుజించి, ఆ జలప్రవాహమును ఏ రీతిగా నిర్మలముగా, ప్రశాంతముగా, పవిత్రముగా చేయునో— అదే విధముగా విద్యార్థి సమాజములో ప్రవేశించి, సమాజమందున్న మాలిన్యమును రూపుమాపి, మహత్తరమైన ఆదర్శాలను నెలకొల్పి, ఆ నెలకొల్పిన ఆదర్శాలను అభివృద్ధిని గావించి, తానుకూడా ఆ ఆదర్శాలను అనుభవించి, అనుభవించిన ఆనందాన్ని పదిమందికి పంచిపెట్టాలి. ఈ విధానమే జీవిత పరమావధి. ఈ విషయాలనే ప్రశ్నోపనిషత్తు లోకానికి తెలియజేస్తోంది.

" నాయనా ! జీవితమనేది ఏకాకి జీవితముకాదు. ఒక సమాజంతో కూడినది. ఇది వ్యష్టిజీవితముగాదు. సమిష్టిజీవితము, సమాజము లేక వ్యక్తి లేడు. వ్యక్తి లేక సమాజము లేదు. వ్యక్తి సుఖశాంతులన్నీ సమాజముపైననే ఆధారపడి ఉంటాయి. కాబట్టి మీరంతా సమాజక్షేమాన్ని కోరండి. " లోకాస్స మస్తాస్సుఖినో భవంతు " — అందరూ సుఖముగా ఉండాలి. అంతా సుఖంగా ఉంటే, అందరిలో మన సుఖం ఇమిడి ఉంటుంది. నీటిపై నవేసిన తైలపుబొట్టు వలె మన సుఖం ప్రత్యేకంగా ఉండదు. నీటితో చేరిన నీరువలె, పాలతో చేరిన పాలవలె సమాజంతో మన జీవితం లీనం కావాలి. ఈ సత్యాన్ని, ఈ సృష్టిరహస్యాన్ని బ్రహ్మచారులంతా గుర్తించాలి" అని పిప్పలాదమహర్షి తన శిష్యులకు బోధిస్తూ వచ్చాడు.

## తోటమాలి - మట్టికుండ

మానవత్వములో కష్టాలు పొందవలసినదే. ఆ కష్టాలకు గురికావలసినదే. ఆ బాధలను సహించవలసినదే. నిందా నిష్ఠూరాలను ఎదుర్కొనవలసినదే. అప్పుడే నిజమైన సత్యం మనకు అర్థమౌతుంది. అంతేకాదు. అప్పుడే ఒక ఉన్నత స్థాయికి చేరుకో గలము. ఇందులకు ఒక చిన్న ఉదాహరణ: ఒక తోటమాలి తెల్లవారి లేచినది మొదలుకొని రాత్రి పరుండు వరకు తోటను కాపాడే నిమిత్తమై చాలా దూరము నుండి మట్టిపాత్రలో నీరు తీసుకొనివచ్చి, ప్రతి మొక్కకు పోసి, పోషిస్తూ వచ్చాడు. ఈ విధముగా తన కర్తవ్యమును సక్రమంగా నెరవేర్చుకొనుట చేత అతని యజమాని మన్ననకు పాత్రుడైనాడు. అంతేగాదు. అతని యజమాని నుండి ఆత్మీయతను కలిగించే గౌరవాన్ని అందుకొన్నాడు.

ఒకనాడు అతని ఇంట కలిగిన అశాంతివలన అసంతృప్తిని పొందినవాడై తన జీవితమును నిష్ప్రయోజనముగా భావించుకొని, తన వెంటనున్న మట్టిపాత్రను క్రిందకుపెట్టి నిరుత్సాహముతో మనోవేదన పొందసాగినాడు. తనలో తాను ఈ విధముగా చింతింపసాగినాడు. " నాకెందుకీ జీవితం ? నా జీవిత మంతా ఈ విధమైన సేవకావృత్తికే అంకితము కావల యునా ? నేను పుట్టినదానికి ఇంతేనా ఫలితం ? అనేకమంది సుఖశాంతులను అనుభవిస్తున్నారు. నేను అట్టి సుఖశాంతులకు నోచుకొనలేదా ! నేను ఎంత పాపిని ! ఎంత దరిద్రుడను ! " అని తనలో తాను చాలా నిందించుకొన్నాడు.

## మట్టికుండ ప్రబోధం

అతని మనోవేదన, ఆలోచన గ్రహించి, ఆ మట్టికుండ ఈ రీతిగా సమాధానం చెప్పడం జరిగింది. " ఓ తోటమాలీ ! ఈ చిన్న అశాంతికే నీవింతగా నైరాశ్యము, నిస్పృహ చెందుట మంచిది కాదు. " కష్టే ఫలే "- అనే సామెతకు నేనే లోకానికి ఒక తార్కాణం. అంతేకాదు నా జీవితమే దానికి ఒక ప్రత్యక్షప్రమాణం. నా చరిత్ర వినుము. నేను పాత్రస్వరూపము పొందక పూర్వము అందరి కాళ్ళ క్రిందపడి త్రొక్కబడిన మట్టిని. కాని కుమ్మరివాడు మట్టి రూపములోనున్న నన్ను తీసికొనివచ్చి, నీటితో కలిపి, కాళ్ళతో త్రొక్కి, చక్రం పైన వేసి గిరగిరా త్రిప్పి, కర్రతో కొట్టి, నన్నొక మట్టిపాత్రగా తయారు చేసి, అగ్నిలో వేసి బాగా కాల్చి, నన్ను విక్రయించుటకు ప్రయత్నించినాడు. నన్ను కొనుటకు వచ్చిన ప్రతి ఒక్కడు నా నెత్తిపైన మొట్టికాయలు మొట్టి, నా గట్టితనమును పరీక్షించుకొనుట జరిగింది. కాబట్టి అందరిచేత మొట్టికాయలను నేను ఆ రీతిగా అనుభవిస్తూ వచ్చాను. ఈ విధమైన కష్టములు నేను అనుభవించి యుండుట చేతనే ఈనాడు సమస్త మానవుల నెత్తిపైన కూర్చొనగల్గుచున్నాను. ప్రతివ్యక్తి నన్ను తన తలపైకి ఎక్కించుకొని గౌరవిస్తున్నాడు. ఈ కష్టాలను నేను ఎదుర్కొనకుండా ఉండినచో ఈనాడు నేను ఈ ఉన్నత స్థాయికి చేరేదానను కాదు. కాబట్టి ఏ ఉన్నతస్థాయికి చేరాలని ఆశిస్తున్నావో,

ఆ ఉన్నతస్థాయికి చేరేముందు అన్ని రకములైన కష్టవిస్తారములతో బాటు, నష్టములు, దుఃఖములు పొందవలసినదే, ఎదుర్కొనవలసినదే." అని పట్టి కుండ తోటమాలికి ప్రబోధించింది.

అందుచేత "న సుఖాత్ లభతే సుఖం" అని చెప్పబడినది. కష్టాలను అనుభవించుటకే ఈ కాయము వచ్చింది. ఈ కాయమును సరియైన రీతిలో ఉపయోగపెట్టినప్పుడే కష్టాలను సహించే ధైర్యసాహసాలు, శక్తులు మనకు లభ్యమవుతాయి. మానవుని యందు లేని శక్తి మరి దేనియందు లేదు. "నేను ఈ కష్టాలను ఏ రీతిగా సహించాలి" అని మానవుడు బలహీనుడౌతున్నాడు. ఆ కష్టములను సహించేశక్తి మనయందే ఉన్నది. కష్టము అంటున్నాము- కాలము గడుపుతున్నాము, ఆ కష్టాన్ని జయిస్తూ వస్తున్నాము. ఇదియే దీనికి ప్రత్యక్ష నిదర్శనం. కాబట్టి జయించే శక్తి మనయందే యుంటున్నది. మనకున్న శక్తిని ఉపయోగించడం తెలియకపోవుట చేత కష్టములకు క్రుంగిపోతున్నాము. అందుచే నిరంతరం ధైర్యంగా ఉంటుండాలి. కష్టము, కష్టము అంటూ క్రుంగిపోతే కష్టాలు మరింత భారంగా కనిపిస్తాయి.

విద్యార్థుల హృదయాలు చాలా సున్నితమైనవి. విషయం తెలియకపోవుట చేత తికమకలు పడిపోతూ ఉంటారు. దేనినైనా ధైర్యంతో ఎదుర్కోవాలి. ధైర్య సాహసములు విద్యార్థులలో అభివృద్ధి కావాలి. సత్యాన్ని వదలక, ప్రేమను విడువక, ధైర్యాన్ని త్యజించక, చలించని మనస్సును, భ్రమించని దృష్టిని విద్యార్థులు అభివృద్ధి చేసుకోవాలి. ఈ విధమైన జీవితం గడిపినప్పుడే కష్టాలకు తగిన ఫలితం పొందుతాడు.

## జ్ఞాతుం — ద్రష్టుం — ప్రవేష్టుం

ప్రపంచంలో ప్రతివిషయాన్ని మనము విచారించి తెలుసుకోవడానికి, అనుభవించడానికి ప్రయత్నించుట లేదు. విచారించకుండా ఏదో అనుభవించుటకు ప్రయత్నిస్తున్నాము. ఈ విషయాన్ని గురించే "జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం" అని ఈ మూడింటిని భగవద్గీత చెపుతూ వచ్చింది. జ్ఞాతుం— విషయాన్ని మొట్టమొదట బాగా తెలుసుకోవాలి. అదే నిజమైన జ్ఞానం. విషయాన్ని తెలుసుకోకుండా గ్రుడ్డిగా ఆ విషయంలో ప్రవేశించరాదు. ఏది మనకు కావాలో, అది ఎక్కడ లభిస్తుందో, ఎట్లు లభిస్తుందో, ఎవరి వద్ద లభిస్తుందో- అని విచారణ చేయాలి. ఉదాహరణ:— మామిడిపండ్ల కాలంలో చక్కని "రసాలు" ఉంటాయి. ఆ రసాలను తినాలని ఆశిస్తాం. ఈ పండు ఎక్కడ చిక్కుతుంది? ఎప్పుడు, ఏ విధంగా చిక్కుతుంది? అనే ప్రశ్నలు వేసుకోవాలి. ఇది మామిడిపండ్ల కాలం. ఈ కాలమందే ఈ పండు లభిస్తుందని జవాబు వస్తుంది. తిరిగి ఈ పండు ఎక్కడ లభిస్తుంది అనే ప్రశ్నకు మార్కెట్‌లో లభిస్తుంది అని జవాబు వస్తుంది. ఎట్లా లభిస్తుంది అని మరొక ప్రశ్న మనలో కలుగుతుంది. డబ్బు ఇస్తేనే లభిస్తుందనే జవాబు వస్తుంది. చివరకు మనము మార్కెట్‌కు పోవాలి అనే భావన కలుగుతుంది. ఈ విధమైన విచారణ చేయుటయే— జ్ఞాతుం. మార్కెట్‌కు పోయి చూచినప్పుడు మామిడిపండ్లు మనకు కనిపిస్తాయి. అదే ద్రష్టుం. ఆ పండ్లను చూచేటప్పటికి మనకు కొంత సంతృప్తి కలుగుతుంది. అటుపిమ్మట ఆ పండ్లను డబ్బు ఇచ్చి పొందుతాము. ఆ పొందిన పండ్లను భుజించటమే— ప్రవేష్టుం. ఈ రీతిగా జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం— ఈ మూడు జరిగినపుడే మనం ఆశించిన ఫలమును పొందుటకు, అనుభవించుటకు వీలగును. కేవలం ఆశించినంత మాత్రమున ఫలాన్ని మనము అనుభవించలేము. చూచినంత మాత్రమున ఫలము అనుభవించుట జరగదు. చూచిన దానిని పొందాలి, పొందిన దానిని జీర్ణించుకోవాలి. అప్పుడే తగిన తృప్తి మనకు అందుతుంది.

విద్యార్థులారా !

ఒక విషయాన్ని మీరు తెలుసుకోవాలనుకొన్నప్పుడు, ఆ విషయాన్ని చక్కగా తెలిసినవారిదగ్గరకు వెళ్ళి తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. "నాకన్నీ తెలుసు. వేరొకరివద్దకు నేను పోనక్కరలేదు" అనే అహంకారమునకు అవకాశము ఈయరాదు. ఈనాటి ప్రపంచంలో తెలుసుకొన్నది అల్పం, తెలియనిది అనంతం. ఏ సైంటిస్టుగాని తెలుసుకొన్నది చాలా స్వల్పమే. ఆతడు తెలుసుకోవలసినది అనంతంగా ఉంటోంది. అనంతమైన విషయాన్ని తెలుసుకొన్నప్పుడే నిజమైన సంతృప్తిని పొందగలుగుతాడు.

## ఆనాటి విద్యార్థులు — ఈనాటి విద్యార్థులు

ప్రశ్నోపనిషత్తు అనేది విద్యార్థులకు చాలా ప్రధానమైనది ఈనాటి విద్యార్థులకు అన్ని విధములైన సందేహములను నివారణ గావిస్తుంది. ఆనాటి విద్యార్థులు వినయవిధేయతలను ప్రకటిస్తూ, చిత్తశుద్ధిని కలిగినవారై, ఇంద్రియ నిగ్రహత్వమును పొందినవారై, సమస్తమును త్యాగముచేసి, ఏ విషయాన్ని తాము తెలుసుకోవాలనుకొన్నారో, ఆ విషయమందే తమ లక్ష్యమును నిల్పి, ఆ "లక్ష్యసిద్ధి"కై విడువని పట్టుదలతో శ్రమించేవారు. కాని ఈనాటి విద్యార్థులలో అట్టి లక్ష్యశుద్ధి లేదు. వారి లక్ష్యం పరి పరి విధాల పరిగెడుతూ ఉంటోంది. తెల్లవారితే ఒక లక్ష్యం, మధ్యాహ్నమైతే ఒక లక్ష్యం, సాయంకాలమైతే మరొక లక్ష్యం. ఈ విధంగా మనస్సును పరిగెత్తింపచేయుట చేత లక్ష్యశుద్ధి కనబడుట లేదు. కాలం మారినా లక్ష్యం మారకూడదు. స్థిరమైన సంకల్పములను అభివృద్ధి చేసుకోవాలి. ఇంద్రియాలన్నింటికి దాసులౌతున్నారు. ఇంద్రియాలన్నింటికి Masters కావాలి. అందులో మీరు బ్రహ్మచారులు, యువకులు. మీ మనస్సులకు మీరు అధికారులు కావాలి. మీ మనస్సులు మీరు చెప్పినట్లుగా వినాలి, నడవాలి. మీ మనస్సు చెప్పినట్లుగా మీరు నడవరాదు. ఇంద్రియాలను అదుపులో పెట్టుకొన్నప్పుడే Master అవుతాడు. ఇంద్రియాలకు దాసుడైనవాడే Slave (బానిస) అవుతాడు. ఇంద్రియాలోలుడు కాకూడదు. చలించే మనస్సు ఉండకూడదు. ఆనాటి ఋషికుమారులందరూ ఈ విధంగా దీర్ఘతపస్సును ఆచరిస్తూ వచ్చారు. వారిలో పట్టుదల (Determination) ఆ రకంగా ఉండేది. వారి జీవితమంతా భక్తికి (devotion) అర్పితం చేసేవారు. వారిలో విచక్షణాశక్తి (Discrimination power) అత్యధికంగా ఉండేది. అందుచేతనే Devotion, Discrimination, Determination — ఈ మూడింటిద్వారా ఆనాటి విద్యార్థులు దివ్యత్వమును పొందగలిగేవారు.

## 'ద'కార త్రియం

ఈనాడు Devotion ఎక్కడా కనిపించుట లేదు. Devotion అంటే జపం చేయుట, ధ్యానం చేయుట కాదు. ఆశయాల నిమిత్తమై జీవితాన్ని త్యాగం చేయాలి. చేసే ప్రతి పనిపైన చాలా శ్రద్ధ చూపాలి. కార్యాన్ని సాధించేవరకు మనస్సు చలించరాదు. అదే నిజమైన పట్టుదల. నీవు చేయదలచిన దానిని క్రమశిక్షణతో చేస్తే, అదే Devotion అవుతుంది. అవసరాన్నిబట్టి విచక్షణ (Discrimination) ఉపయోగపెడుతున్నారు. అనుకూలతను, సమన్వయాన్నిబట్టి ఈ Discrimination ఉపయోగిస్తున్నారు. మన సమర్థతను బట్టి కూడా విచక్షణాశక్తిని ప్రవేశపెడుతున్నాము. మనది దోషమైనప్పటికి సమర్థించుకునే నిమిత్తమై విచక్షణా శక్తిని చూపించుకుంటున్నాము. ఇది సరియైన విచక్షణా శక్తి కాదు. ఇది కేవలం స్వార్థపరమైన విచక్షణా

శక్తి (Selfish Discrimination) అవుతుంది. ఇదే వ్యక్తిగతమైన విచక్షణాశక్తి (Individual Discrimination) అవుతుంది. కాని Funda-mental Discrimination కావాలి. అనగా ఈ విచక్షణాశక్తి "సర్వజన సమ్మతమైనది" గా ఉండాలి. ఈ విషయంలో "స్వ - పర" అనే భేదములుండరాదు. అందరికీ ఒకే సత్యం వర్తించాలి. అట్టి తీర్పును ఎవరు చేసినప్పటికి, "ఇది Right" అనే జవాబు రావాలి. కాని ఈనాటి Discrimi-nation ఈ విధంగా లేదు. తన దానిని తాను సమర్థించుకొనే నిమిత్తమై స్వార్థపరమైన విచక్షణాశక్తిని చూపిస్తున్నారు. ఇది విద్యార్థులకు చాలా విరుద్ధమైన మార్గము. కనుక మనకు సమాజపరమైన Discrimi-nation కావాలి. ఈ విధమైన తీర్పు చేసినప్పుడే, అన్నిటికీ నీవు అధికారి కాగలవు. లేకపోతే కొన్ని శిక్షలకు గురికావలసి వస్తుంది.

## బాధ్యతలు — హక్కులు

ఈనాటి విద్యార్థులలోపల ప్రేమ తగ్గిపోవుచున్నది. అది పవిత్రమైన దీక్షతో కూడి ఉండాలి. మనం ఏనాడు Energy కోల్పోతున్నామో, ఆనాడే మనలో Elergy ప్రారంభమౌతుంది. Elergy కి అవకాశం ఇవ్వకుండా Energy ని పోషించుకోవాలి. అదే మానసిక సంబంధమైన శక్తి. ఆ మానసిక శక్తి చలించకుండా ఉండాలని పిప్పలాదమహర్షి విద్యార్థులకు ప్రబోధిస్తూ వచ్చాడు. భవిష్యత్తులో విద్యార్థులే జగత్తును పరిపాలించే అధికారులు. పరిపాలన చేయుటకు తగిన శక్తిసామర్థ్యాలు సంపాదించాలి. కేవలం విచక్షణాశక్తి కోల్పోయి మాకు హక్కు (Right) ఉన్నదని యుద్ధము (Fight) చేయుట కాదు. Right కోసమే Fight చేయరాదు. బాధ్యతను (Responsi-bility) కూడా గుర్తించాలి. మన బాధ్యతను మనము నిర్వర్తించాలి. తల్లిదండ్రుల బాధ్యత, సమాజ బాధ్యత, దేశబాధ్యత, తమ జీవితబాధ్యత గుర్తించి, వర్తించినప్పుడే బాధ్యతాయుతమైన సహజమైన హక్కు మనకు ప్రాప్తిస్తుంది. బాధ్యతను చక్కగా గుర్తిస్తే, automatic గా rights మనకు వస్తాయి. బాధ్యతను వదలిపెడితే మనకు హక్కు లభించదు. మానవ జీవిత పరమావధిని గుర్తించడానికి పిప్పలాద మహర్షి వద్దచేరిన ఆరుమంది శిష్యులు ఆరు ప్రశ్నలు వేస్తూ వచ్చారు. పిప్పలాదుడు ఒక్కొక్క శిష్యునకు చక్కని సమాధానం అందిస్తూ వచ్చాడు.

## SKILL—KILL

ఈ కలికాలమందు, అందులోను విద్యార్థిబృందానికి ఆ సమాధానములెంతేని అవసరం. ఆ సమాధానములు తెలుసుకున్నచో, నేటి విద్యార్థులు ఈనాటి కలి ప్రభావమునకు గురికారు. దేశ, కాల పరిస్థితులను అనుసరించడం కాదు, తమ హృదయ శుద్ధిని విచారించుకోవాలి. నిరంతరం బహిర్ముఖమైన దృష్టినే మనం ప్రసరింపచేసుకుంటున్నాము. అంతర్దృష్టిని గుర్తించాలి, దానిని పెంచుకోవాలి. "రిఫ్లెక్షన్ ఆఫ్ ది ఇన్నర్‌బీయింగు" కావాలి కాని, స్థిరచిత్తము లేని భావపూరితులు కాకూడదు. విద్యార్థులలో తెలివితేటలు లేకపోలేదు. కాని ఆ తెలివితేటలను సక్రమమైన పద్ధతిలో పెట్టుకోవటం, పెంచుకోవటం జరుగుట లేదు. ఆ తెలివితేటలను సక్రమమైనరీతిలో 'స్కిల్' చేయుట లేదు ఆ "స్కిల్‌ని—కిల్" చేస్తున్నారు. ఆ తెలివి "కిల్" చేయుటవలన మేధాశక్తి యొక్క బలన్సు తప్పిపోతుంది. అందుచేతనే, సమచిత్తము కల్గిన విద్యార్థులు కావాలి. అప్పుడే— అట్టి తెలివిని Balance of Mind అంటారు. అట్టి మేధాశక్తిని మీరు అభివృద్ధి పరచుకోవాలి.

## శ్రీవారి సందేశం

విద్యార్థులారా!

లోకానికి విద్యార్థులెంతేని అవసరం. మీరు అనుసరించే పద్ధతులవల్ల దోషులౌతున్నారు. కాబట్టి హృదయాన్ని పరిశుద్ధంగా ఉంచుకుంటే ఎట్టి క్లిష్టపరిస్థితులందైననూ విజయాన్ని సాధించవచ్చు. అట్టి విశ్వాసాన్ని పెంచుకోవాలి. మొట్టమొదట ఆత్మ విశ్వాసము (సెల్ఫ్‌కాన్ఫిడెన్సు) పెంచుకోవాలి. ఆ ఆత్మ విశ్వాసమనేది జీవితానికి ఒక చక్కటి పునాది. ఈ పునాది గట్టిగా ఉంటే, ఆత్మతృప్తి (సెల్ఫ్ స్యాటిస్‌ఫ్యాక్షన్) అనే గోడలను ఆ పునాదిపై కట్టుకో వచ్చును ఈ ఆత్మ సంతృప్తి అనే గోడలు గట్టిగా ఉంటే, స్వార్థత్యాగం (సెల్ఫ్‌స్యాక్రిఫైస్) అనే పై కప్పు వేసుకోవచ్చును. సెల్ఫ్‌స్యాక్రిఫైస్ అనే రూఫ్ వేసినప్పుడే ఆత్మసాక్షాత్కారం (సెల్ఫ్‌రియలైజేషన్) పొందవచ్చును. సెల్ఫ్‌కాన్ఫిడెన్సు, సెల్ఫ్‌స్యాటిస్ ఫ్యాక్షన్, సెల్ఫ్‌స్యాక్రిఫైస్, సెల్ఫ్‌రియలైజేషన్- ఈ నాల్గింటికి ముందుపదం "సెల్ఫ్" అని ఉన్నది. ఈ సెల్ఫ్ ఎవరు? దానిని మనం గుర్తించాలి. ఈ సెల్ఫ్ ప్రక్కనే చేరుకున్న పదములన్నింటికి సెల్ఫ్ ప్రధానము. సెల్ఫ్ అనగా ఏమిటంటే, "నిజమైన ఆత్మతత్త్వం" అని గుర్తించవలెను. ఇవన్నీ కేవలం కొన్ని పదార్థముల వంటివి. ఇవంతా ఆధేయములు, సెల్ఫ్ ఆధారం, అదే ప్రాణం. కనుక మొట్ట మొదట సెల్ఫ్‌ను సరియైన రీతిలో పెట్టుకోవాలి.

ప్రజలకు ఆరోగ్యకరమైన, ఆదర్శవంతమైన సేవలు అందించాలి. మీరు చేసే సేవలు హృదయ పూర్వకంగా ఉండాలి. ఎవరేమనుకుంటున్నారో అనే భయాన్ని విసర్జించాలి. ఎవరేమనుకొన్నా సరే— నీవు చేయవలసిన "ధర్మకర్తవ్యం" మానుకో రాదు. ఎవరేమనుకొన్నా నీవు చేసే మంచిని— నీవు చేయి. యువకులలో ఈ విశ్వాసం చాల మృగ్యమై పోయింది. కష్టాలను ఎదుర్కొంటూ, ధైర్యాన్ని చేపట్టుకుంటూ, జీవితాన్ని ముందుకు సాగించండి. అన్ని దేశాలకన్నా భారతదేశం చాలా పవిత్రమైనది. ఇది త్యాగభూమి, యోగభూమి, కర్మభూమి. ఇతరులు మన పవిత్రమైన భూమిని భోగభూమిగా మార్చుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. మనకు ఎట్టి భోగములతో సంబంధము లేదు, త్యాగమే కావాలి. కాబట్టి మనం కర్మవీరులు కావాలి. కర్మజీవులు కావాలి. కర్మఫలత్యాగులు కావాలి. కావున ముమ్ముందు మీరు దేశానికి తగిన రీతిగా ఆదర్శాన్ని అందిస్తారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

శ్రీవారి దివ్యబోధ
26—5—1991,
బృందావనం.

సత్యసాయి మహితోక్తులు!

1) భయపెట్టటం మృగలక్షణం; భయపడటం పశులక్షణం. మానవునికి ఈ రెండూ ఉండరాదు. 2) శాంతిని పెంచే శాంతిదూతలం కావాలి, అశాంతిని పెంచే యమదూతలు కారాదు. 3) శ్వాసయే మంత్రం; హృదయమే తంత్రం; దేహమే యంత్రం. 4) శీలత్రయం: పవిత్రం, సహనము, ధైర్యములను సాధించండి. 5) సత్యం జన విరోధం, అసత్యం జనరంజకం. 6) సంఘ నీతియే మానవజాతికి జ్యోతి. 7) సమదృష్టియే శుభదృష్టి. 8) సేవ ప్రేమయొక్క మనోహర పుష్పం.

# గురుత్రయం

క॥ శ్రీ రమ్య భారతావని
పారాశర్యాది ఋషులు ప్రభవించిరి, బం
గారపు బాటలు వేసిరి
వారు జగద్గురులు వంగి ప్రణతు లొనర్తున్.

క॥ అంతా భగవన్మయమే
మంతయు నాతండులేని చోటున్నదె ? వి
క్రాంతుఁడు విశ్వాత్ముఁడు స
ర్వాంతర్యాముండు గురువు వానికి జేజే !

క॥ చూపించు తల్లి తండ్రిని,
ఆ పితయుఁ గురుని చూపు, ఆ గురుఁడౌరా!
ఆ పరమేశ్వరుఁ జూపును
ఈ పరమ "గురుత్రయంబు" నెపుడు భజింతున్

క॥ ఏ విద్య నేర్చుకొన్నచొ
లేవో భవబంధనములు ! క్లేశము లేదో !
ఆ విద్యనిచ్చు గురునకు
దైవంబేయనుచు మ్రొక్కెదను సతతంబున్.

క॥ సాకార పరబ్రహ్మము
సాకార జనార్దనుండు, శంభుడతండే
లోక గురుండగు సాయికి
పీక నమోవాకములను వేలర్పింతున్.

క॥ గురుపూర్ణిమ పర్వంబున
గురుభక్తి నొసంగుచుంటి కొనుమీకాన్కన్
కరము గృతజ్ఞుడ "రత్నా
కరవంశా !" సత్యసాయి ! కరుణావార్ధి !

—వీరుభొట్ల సూర్యనారాయణ, తాడేపల్లిగూడెం. (ప. గో. జిల్లా)

# సాయిలక్ష్మి

శ్రీకాంతా ! వరవైష్ణవీ ! హరిమనః ప్రేమైక ప్రాణేశ్వరీ !
రాకాచంద్రసహోదరీ ! శుభకరీ ! రాజేశ్వరీ ! సుందరీ !
లోకానందకరీ ! కృపారసఝరీ ! లోకైక భాగ్యేశ్వరీ !
శ్రీకల్యాణమణీ !— నమోస్తు వరలక్ష్మి ! సత్యసాయీశ్వరీ !

మాతా ! మంగళదేవతా ! హృదయపద్మంబందు సద్భక్తిమై
గీతాలాపనతోడ శంకర పదాంగీకార - కావ్యార్చనల్
ప్రాతస్సాయముచేసెదన్ కనకధారావర్షిణీ ! హర్షిణీ !
చేతోమోదము గూర్పవమ్మ ! వరలక్ష్మి ! సత్యసాయీశ్వరీ !

కాంతిశ్రీలు జగంబునిండ గృహముల్ కల్యాణ సాహిత్య వే
దాంతశ్రీలు వెలుంగ - దేశము ప్రమోదంబంద - రాష్ట్రాలు సం
క్రాంతశ్రీ పథమందు సాగగ — ప్రజారాజ్యంబు రంజిల్లగా
శాంతిశ్రీలిడు- "సాయిలక్ష్మి "యయి శ్రీసాయీశ్వరుండోముతన్

—"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి, ప్రశాంతినిలయం.